ఓమ్

శ్రీరామ శ్శరణం మమ

శ్రీ స్కాందాది సర్వశైవ పురాణ సంహితా

నిగమాగమ ప్రతిపాదిత

# శ్రీ పార్వతీ పరమేశ్వర కల్యాణ వైభవః



ఏతద్గ్రంథగ్రథనకర్తా :

ములుకుట్లోపనామక నరసింహావధానీ సోమయాజీ శర్మా

రామాయణ శాస్త్రీతి ప్రథితః

చిత్రకూటాశ్రమం, కృష్ణలంక,

విజయవాడ-2.

[వెల: రు 1-00

శ్రీరామ శ్శరణం మమ

శ్రీ స్కాందాది సర్వపురాణ సంహితా నిగమాగమ
ప్రతిపాదిత

# శ్రీ పార్వతీ పరమేశ్వర కల్యాణ వైభవః

## శ్రీ శివప్రసన్నాత్మక ప్రథమస్సర్గ ప్రారంభః

నానా పురాణ నిగమాగమ సారభూతౌ, నానా విధాత్మక
సుపుణ్యద నామరూపౌ। నానావ్రతక్రతు సుతపోధన సుప్ర
సన్నౌ, గౌరీశివౌ మమ సదా హృది సన్నిధత్తాం॥ 1

శివాశివౌ కారణ కార్యభావౌ, సూర్యాతపౌ వాచక
వస్తురూపౌ,। బహ్మాత్మభావేన సదైక వేద్యౌ, జీవాత్మకౌ
తౌ ప్రణమామి నిత్యమ్॥ 2

దైవతాని కతి సంతిహిలోకే, మోక్షదస్తు సుతరాం నహి
తేషాం। ఏకఏవహి శివో భయధసా, శ్రూయతేహి నిత
రాం సతు దాతా॥ 3

నైమిశేఽనిమిషక్షేత్రే శౌనకాది మహామునీన్।
సూతో రామాయణం కాండషట్క ముక్త్వాఽబ్రవీదిదమ్॥ 4

శ్రీరామ శ్శరణం మమ

# శ్రీ స్కాందాది సర్వశైవ పురాణ సంహితాగమ ప్రతిపాదిత మగు శ్రీ పార్వతీ పరమేశ్వర కల్యాణ వైభవము

## శివప్రసన్నాత్మక ప్రథమ సర్గము

1 సర్వ పురాణేతిహాస నిగమాగమ సారభూతులును, అనేకవిధము లగు పుణ్య మొసగెడి నామరూపములు గలవారును, తపోధన సర్వశ్రేష్ఠ విరామాదులచే ప్రసన్నులగు సాక్షాత్పార్వతీ పరమేశ్వరులు ఎల్లప్పుడును నా హృదయమున నెడబాయక నివసింతురు గావుత ।

2 అట్టి గౌరీశంకరులు కార్య కారణములవలె, ఆదిత్యాతపముల వలె, వస్తువాచకముల వలె బ్రహ్మాత్మభావమున నేకస్వరూపులు. వారే జీవాత్మ ప్రకృతిభావముచే చెప్పబడుదురు. అట్టి శివా శివులకు నిత్యము నమస్కారము గావింతును.

3 ఈ ప్రపంచమం దెందరు దేవతలు లేరు. వారిలో నొకరయినను మోక్ష మొసగువారు బొత్తిగా లేరు. సదాశివుడు మాత్రము యిహ పరముల నొసగును కావున పరమేశ్వరుడే దాత యని శ్రుతి పల్కెను.

4 ఒకప్పుడు పాపరహితమును, దేవభూమి యగు నైమిశారణ్య మందు శౌనకాది మహర్షులకు సూతమహర్షి శ్రీ రామాయణమును షట్కాండలను వివిపించి మరల వారితో నిట్లు పలికెను.

శివేనైవహి కైలాసే శృణ్వన్ రామాయణం ముహుః,
ఆస్తేద్యాపి మునిశ్రేష్ఠాః పార్వతీ సా పురా సతీ॥ 5

మునయః :- విదితం పూర్వమేవైత ద్దక్షస్య చరితం సతీ,
తస్య పుత్రీతి సా శైల పుత్ర్యభూదితి సంగ్రహాత్॥ 6

కథం జాతా కథం సా తూ చ్ఛివా ద్గ్రహణమాపసా,
కో వా కల్యాణసంధాతా తత్కల్యాణం వదస్వ నః॥ 7

యో నామరూపేచ శివో మహేశో, యా మంగళా సర్వ శివాచ గౌరీ, తయోస్తు కల్యాణకథా ప్రసంగే త్వనంత బ్రహ్మాండ శుభం భవేద్ధి॥ 8

శ్రీ సూత ఉవాచ -

శివాచ మామేవ సుతా భవేచ్ఛే, చ్ఛివోఽపి జామాతృ తథా భవేద్ధి, తద్బ్రహ్మ తత్తేజస్వరూపకౌ తౌ, తత్సేవ నాత్ ముక్తిమమేతి భావాత్॥

నగాధిరాజో హిమవాన్ సుతప్త్వా, వరంచ లబ్ధ్వా స్వసతీంచ మేనా, మువాచ సా గర్భ మవాప్య రాత్రౌ, శుస్స్వప్న వృత్తం హి ప్రసూయ దృష్టా॥ 9-10

5 ఓ మహర్షులారా ! ఈ విధమున నిరంతరమును కైలాసమందు పరమేశ్వరునిచే పార్వతీదేవి రామాయణమును వినుచుండును. ఇప్పుడును అట్టి రామాయణ ప్రవచన శ్రవణములు జరుగుచునే యున్నవి. కాని ఆమె పూర్వము దక్షపుత్రికయగు సతీదేవి – ప్రస్తుతము పార్వతీదేవి యనబడుచున్నది అని చెప్పెను.

6 అది విని మును లిట్లు ప్రశ్నించుచున్నారు :– దక్షుని చరితమును సతీదేవి యాతని కూతురుగ తపోమహిమచే పుట్టుటయు తుద కామెయే ప్రస్తుతము హిమవంతునికి పార్వతి యనుపేర కుమార్తెగా నవతరించెనని మాత్రమే సంగ్రహముగ వింటిమి. కాని –

7 ఆ జగజ్జనని పర్వతరాజున కెట్లు సంభవించెనో, ఆమెకు శివానుగ్రహ మెటుల కలిగెనో, విరక్తుడగు శివునకును, ఆమెకును కల్యాణము సంఘటింపజేసిన దెవరో ఆ కల్యాణ వృత్తాంతమంతయును మాకు మీ రనుగ్రహింపుడు. ఏలయన –

8 ఆ మహేశ్వరుడు నామరూపములచే శివుడు (మంగళప్రదుడు). మంగళస్వరూపమే శివా యను నామము గల పార్వతీదేవి. వారి కల్యాణప్రసంగముచే ననంత బ్రహ్మాండములకును శుభ మేర్పడును గావున చెప్పుడు.

9–10 సూతమహర్షి యిట్లు చెప్పుచున్నాడు :– ఆ నగాధిరాజగు హిమవంతుడు పరమేశ్వరి తనకు పుత్రిక అయినచో పరమేశ్వరుడు తనకు తప్పక అల్లుడగును గదా ! వా రుభయులును బ్రహ్మమును ఆయనతేజస్సు వలె నేకస్వరూపులు. కావున వారి సేవచే నాకు ముక్తి కలుగును. అను భావముచే గొప్పతప మాచరించి ప్రత్యక్షమయిన పరమేశ్వరిచే నా విధమున వరము గైకొని తన ప్రియభార్య యగు మేనక కది తెలియపరచెను. ఆమెయును వెంటనే గర్భము ధరించి నవమాసానంతర మొక రాత్రియందు స్వప్నమందువలె ప్రసవించి మేల్కాంచి తేజస్వియగు వా బాలను గాంచెను.

సులగ్న తాదా గ్రహయుక్త కాలే, స్వయం కుమారీవ బభూవ గౌరీ, సా పార్వతీతి ప్రథితా ప్రవర్ధితా, పిత్రో స్సకాశే నృపలీలయాచ॥ 11

శివోఽపి దక్షస్య క్రతుం విదగ్ధ్వా, విరక్త ఆసీత్సతు దక్షిణాస్యః, మౌనేన వ్యాజేన శుకాదిమౌనీన్, బ్రహ్మాత్మ భావం ప్రవదన్ యువైవ॥

హిమశైలకూటే రజతాద్రిమధ్యే, మహావటస్యాథ ఉపాశ్రితశ్చ. నందీ ద్వితీయోపి సమాధియుక్తో రరాజ లోక ప్రవిబోధనార్థం॥ 12-13

సా పార్వతీ నారద చోదనాచ్చ పిత్రాజ్ఞయా యౌవన భావయుక్తా, కైలాస మాగత్య సమాధియుక్తం, శివం సమారాధ్య జగామ నిత్యం॥ 14

పునశ్చ సా స్వీయ సఖీ సమేతా- పిత్రాజ్ఞయారణ్య ముపేత్య తీవ్రం, తప శ్చచా రాశ్రమ ధర్మయుక్తా, నందీశ్వరాజ్ఞా చ్ఛివ మర్చయన్దినం॥ 15

శివప్రసన్నార్థ మపర్ణభక్షా ముమేతి తాం బంధుజనాః ప్రవోచుః, తదా భవత్తారక దైత్యపీడా, లోకత్రయం చాకులమాప సర్వం॥ 16

సతీశ్వరస్యైవ సుతా త్స్వకీయ మృత్యు ర్భవే దేవ న చాన్యథేతి, వరప్రభావా త్సురమౌనిసంఘా, బ్రహ్మాణ మాగత్యచ సర్వమూచుః॥ 17

11 మంచి నక్షత్రరాశీ గ్రహయోగ సమయమున నా విధముగ గౌరీ దేవి యవతరించి పార్వతి యను సుప్రసిద్ధనామమున రాజోచిత మర్యాదలతో తలిదండ్రుల సమీపమున లీలచే పెరుగుచుండెను.

12-13 అచ్చట పరమేశ్వరుడు - సతీ స్వస్వరూపప్రాప్తివి జెంద దక్షుని యజ్ఞధ్వంసము గావించి, విరక్తునివలె హిమశైల రజితాద్రిమధ్యమున గల వటవృక్షచ్ఛాయ యందు నందీశ్వరుడు మాత్రమే సేవింప నాసీనుడై యువకస్వరూపమున సనక శుక వామదేవాదులకు మౌనవ్యాఖ్యాన రూపమున తత్వజ్ఞాన ముపదేశించుచు బ్రహ్మజ్ఞానమును లోకప్రచార మొనరించుటకై సమాధినిష్ఠుడై యుండెను.

14 పార్వతీదేవియు వివాహోచిత వయోవతియై నారద ప్రేరణమున పితాజ్ఞచే సమాధియుక్తుడగు పరమేశ్వరుని నిత్య మారాధించుచు పితృగృహ మేగుచుండెను.

15 శివుడు ప్రసన్నుడు కానందున నామె ఆ యరణ్యమున నొక ఆశ్రమమును కల్పించుకొని పితాజ్ఞచే సఖులు సేవింప తీవ్రమయిన తప మాచరింపుచు ఆశ్రమధర్మముల పాటించుచు - నందీశ్వరాజ్ఞచే శివుని పూజించుచుండెను.

16 తుదకామె శివప్రసన్నార్థమై పర్ణములను భక్షింపమిచే "యపర్ణ" యవియును, బంధువు లందరును "ఉ-మా" యని తపము చాలింపుమను నర్థమున నామెను పిలుచుచుండిరి. ఆ సమయమున తారకాసురుని పీడచే లోకత్రయ మాకులము చెందుచుండెను.

17 ఆ తారకాసురుడు శివుని కుమారునిచే తప్ప తదితరులచేత తనకు మృత్యువు లేనట్లు వరము వడసినవాడు. అందువలన సర్వదేవ ర్షులును బ్రహ్మదేవుని సన్నిధి చేరి సర్వమును వివేదించిరి.

ఇంద్రాజ్ఞయా బ్రహ్మసమీప మాగా త్సతీ సమేత స్సతు
మన్మథోఽపి, వటస్య వృక్షం శివసన్నిధానం గత స్సధాతు
ర్వచన ప్రణోధాత్॥

వసంత ముఖ్యా స్తుగణం ప్రగృహ్య, వ్వన తు రమ్యం ప్రవి
కల్ప్య మారః, గౌరీసమక్షం ప్రముమోచ బాణం శివో
పరి స్తేన ప్రబోధితశ్చ॥

నందీశవాక్యేన శివోఽపి జ్ఞాత్వా, మారం ప్రదగ్ధ్వాథ
శివాంచ దృష్ట్వా, గతోన్య దేశం సగణో మహేశో, గౌరీ
రతీం వీక్ష్య శివం వరం దదౌ॥

తతస్తు సా హైమవతీ శివార్థం, స్వీయాశ్రమే తీవ్రతప
శ్చచార, వటుస్వరూపేణ సమేత్య శర్వ స్తామాహ
తీవ్రస్య తపస్య కారణం॥ 18-19-20-21

సఖీముఖా త్తత్తు శివోఽపి శ్రుత్వా, ఉవాచ దేవీం ప్రహస
న్వయిస్త్వాం, అమంగళాభ్యాసరత శ్శివోఽహం, త్వం మాం
స ఏవేతి వృణుష్వ కామం॥ 22

శ్రుత్వాహ గౌర్యాఽలికే బ్రహ్మబంధుం, బహి ర్మదీ
యాశ్రమత స్సపద్య, శివస్తు స్వీయాత్మ స్వరూపతోఽస్యా
హ్యాస్తం ప్రగృహ్యాహ క్షమస్వ దేవి॥

తవాద్య దాసోఽస్మి తపేన క్రీతో, మాం స్వీకురు త్యక్త
మనుగ్రహేన, యో మ త్స్వరూపం ప్రవివేత్తి ముక్తో,
విరూప ఇత్యేవ వదంతి పాపాః॥

18-19-20-21 అంత బ్రహ్మనిదేశమున వింధ్యుని యాజ్ఞచే రతిసమే తుడై మన్మథుడు వచ్చి బ్రహ్మదేవుని యాజ్ఞను మీరలేక మహా దేవుడు సమాధినిష్ఠయందున్న వటవృక్షము చేరి తన స్నేహితు లగు వసంతాదుల వెంటనిడికొని ఆ వనమంతయును రమ్య మొన రించి పార్వతీదేవి శివుని మెడలో హారము వైచు సమయమున శివునిపై తన పంచబాణముల వైవ శివునకు సమాధిభంగమై పార్వతిని చూచి నందీశ్వరునిచే సర్వమును తెలిసుకొని శంకరుడు మారుని భస్మము గావించి అచ్చటినుండి వెళ్ళిపోయెను. అంత రతిదేవి పార్వతీదేవిని ప్రార్థింప, ఆమె నా వివాహానంతరమున నిన్ను రక్షించెదనని వరమొసగి తన యాశ్రమమున కేగి తప మాచరించుచుండ పరమేశ్వరు డచ్చటికి వటుస్వరూపమున వచ్చి పార్వతిని చూచి యామె తపఃకారణము నడిగెను. కాని ఆమె తాను చెప్పక చెలికత్తెలచే చెప్పించెను.

22 అంత శివు డా చెలికత్తెలచే కారణమును తెలిసుకొని పార్వతీదేవి తో ఓ సర్వమంగళా ! సర్వామంగళాభ్యాసరతు డా శివుడు గాన నాతని వదలి నేనే ఆతడని భావించి నన్ను వరింపు మనెను.

23-24-25 పార్వతీదేవి అది విని చెలికత్తెలను జూచి - ఈ బ్రహ్మ బంధువు మన యాశ్రమము వెలుపలికి నెట్టివైవుడన వారు బంగారు వేత్రములతో యా వటువి సమీపమునకు వచ్చిరి. వెంటనే ఆ బ్రహ్మచారి విష్ణ్వాది సపరివారముగ స్వస్వరూప మును పార్వతీదేవికి జూపి ఆమెచేతిని పుచ్చుకొని - ఓ దేవీ ! పరుష వాక్యము పల్కినందుకు నన్ను క్షమింపుము. నేను నీ తపో ధనముచే విక్రయింపబడిన నీ దాసుడను. నన్ను బహిష్కరింవ

తథాపి తే మద్భజనే స్పృహాపా, రూపా ద్విరూపా ద్వ్యహమేవ వేద్యాః, అహంహి సర్వం శివరద్రిభావా, స్సత్యేన మాం పశ్యతి యస్స ముక్తః॥ 23-24-25

తం సా ప్రపశ్య న్భువనైకసుందరం, బ్రహ్మేంద్ర విష్ణ్వాది యుతం మహేశం, ప్రణమ్య దేవీ వరదం తమాహ, మాం రాజధర్మేణ గృహాణ చేతి॥ 26

తథాస్త్వితి స్తత్ర తిరోదధే సా, శివాపి శైలేశ గృహం జగామ, వరప్రదానంతు శివస్య శ్రుత్వా, తుష్టా స్సమస్తా నగరాజపుత్రాః॥ 27

ఇతి ప్రసిద్ధం శివసుప్రసన్నం, రామాత్తవాక్యై స్స ఉవాచ భక్తః, ముల్కట్ల వంశీయ నృసింహనామా సచావధానీతిచ పాకయాజీ॥ 28

ఇతి శ్రీ పార్వతీ పరమేశ్వర కల్యాణ వైభవే శివ ప్రసన్నాత్మక ప్రథమస్సర్గః సమాప్తః.

---

కుము. ముక్తులయినవారికి మాత్రమే నా సర్వమంగళ స్వరూప దర్శన మగును, పాపులు అమంగళుడని యన్నందురు. అదియును నా కిష్టమే యగును. నా గట్లువినను నన్నే భావించినవా రగుదురు గాన వారి పాపములను సహితము నశింపజేసెదను. శివుడను రుద్రుడను నేనే యగుదునుగదా! కాని నా యదార్థసుందర స్వరూపము ముక్తులకు మాత్రమే గోచరించును.

26 అంత నా పార్వతి భువనైక సుందరమూర్తి యగు నా శివుని, అతని పరివేష్టించియున్న బ్రహ్మేంద్ర విష్ణ్వాదులను గాంచి సంతోషించి నమస్కరించి యా శివునితో - ఓ దేవా! వన్నను గ్రహింప దలచితివేని రాజమర్యాదలతో నన్ను పెండ్లాడుడని ప్రార్థించెను.

27 అది విని శివుడు అటులనే యగునగాక యని చెప్పి సపరివారముతో నంతర్ధాన మొందెను. పార్వతియును చెలులతో హిమవంతుని గృహమున కేగి సర్వమును తెలియజేయ రాజబంధువులతో హిమవంతుడు సంతోషించెను.

28 ఇటుల సుప్రసిద్ధమగు శివసాక్షాత్కార వైభవకథను శ్రీరామచంద్రు డనుగ్రహించిన వాక్యములతో ములుకుట్ల నరసింహావధాని పాకయాజి ఖండకావ్యముగా రచించెను.

ఇట్లు శ్రీ పార్వతీ పరమేశ్వర కల్యాణవైభవమందు శివప్రసన్నాత్మకమను ప్రథమసర్గము ముగిసెను.

# ద్వితీయసర్గము ఆరంభము

## సప్తర్షి సందేశము

శ్రీ సూతమహర్షి శౌనకాదులకు ఇట్లు చెప్పుచున్నాడు.

1 ఆ విధమున శంకరుడు కైలాసమునకు వచ్చి వివాహ విశ్చయా ర్థమై జ్యోతిస్వరూపులయిన అరుంధతీసహిత సప్తర్షులను స్మరింప నరుంధతీసమేతులై వారు కైలాసమున కరుదెంచి శివునకు ప్రణ మిల్లిరి.

2 వారును శివునిభావ మెరిగినవా రగుటచే రాజోచితవేషమున స్వర్ణ రత్న రుద్రాక్షమాలికలను, ముడివైచిన గడ్డములను, జడలను, బంగారుజరీ వల్కలములను, స్వర్ణయజ్ఞోపవీతములను ధరించి వచ్చినవారిని జూచి శివుడు జరుగవలసిన దంతయును జెప్పెను.

3 వారును శివాజ్ఞచే పర్వతరాజకన్యను శివార్థమై నిశ్చయించుటకు హిమాలయమున గల ఓషధీప్రస్థ పట్టణమధ్య నున్న హిమవం తుని బంధుజన సమృద్ధమగు సౌధమును బ్రవేశించిరి.

4-5 అచ్చట గల పర్వతరాజ ముఖ్యబంధువులగు మేరు మహేం ద్రాదు లా మహర్షులను, అరుంధతీదేవినీ - ఆప్తబంధు సమే తులై వారి నర్హమగు విధానమున పూజించిరి. వారును పేరుకు స్థావరములగు పర్వతనామరూపములు కలవారయినను సమయము వచ్చినప్పుడు మానుషరాజవేష భూషాభాషణములతో గృహారామ సతీసుతాదులతో నుందురు. అట్టి పర్వతరాజులచే నా మహర్షులు పూజింపబడి దారుబెత్తములచే నిర్మించబడిన ఆసనములందు కూర్చుండిరి. ఆ మహామునులకు పర్వతరాజులు నమస్కరించి వినయముగ నీ విధమున ప్రశ్నించిరి.

(పర్వతాః) కేయూయం (మునయః) పరమేశ్వరస్య సచివా స్న ష్టర యోరుంధతీ, (పర్వ)భాగ్యం కిం మనసేప్సితం (ము) తపసుతాదేయా శివాయాదరాత్, (పర్వ) భద్రిం భోః పర మేశ్వరస్య విభవం యద్యస్తి తత్కథ్యతాం (మున) లోకం సర్వ మ పీశ్వరస్య విభవం కిం బ్రూమ హే పర్వతాః॥ 6

(పర్వతా) తథాపి తస్యైవ సువేషభూష. స్థానాధిపత్యాదిషు సంశయం నః, (మున) సర్వం శివం తస్యతు పృచ్ఛ్యతాం త ద్యథాతథం బ్రూమ న సంశయం భోః॥ 7

(పర్వ) స్మశానవాసీతి వదంతి కేచిత్, కిమర్థమత్రైవ బభౌ మహేశః, (మున) బ్రహ్మేంద్ర విష్ణ్వాది సమస్తలోకాన్ భస్మీ చకార ప్రళయే శివోఽపి।

6 పర్వతరాజులు :- అయ్యా తమ రెవరయినది తెలుసుకొనవచ్చునా?

మునులు:- మేము పరమేశ్వరుని సచివులము, సప్తర్షులనువారము. ఆ సాధ్వి యరుంధతీదేవి,

పర్వత:- మహాభాగ్యము. తమ శుభసంకల్ప మేదై ఉండవచ్చును?

మునులు :- మీలో హిమవత్పుత్రికను సదాశివునకు భార్యనుగా ఆదరముచే నివ్వవలయునని వరించుటకై వచ్చితిమి.

పర్వత :- శుభమగుగాక ! అటులయినచో మా కా పరమేశ్వరుని ఆస్తిపాస్తుల వైభవ మెంత గలదో దాని ననుగ్రహింపుడు.

మునులు :- ఈ కనీ వినీ ఊహింపబడు అనేకకోటి బ్రహ్మాండము లన్నియును ఈశ్వరుని వైభవమగు ఐశ్వర్యమే యగును. కావున మేమింతయని యెట్లు చెప్పగలము.

7 పర్వత :- మీ రనినయటులే యగుగాక. అందు శివుని వేషభూషా స్థానాధిపత్యాదులందు మాత్రమే మాకు కొంత సందేహము కలదు.

మునులు :- శివునికి సంబంధించిన దంతయును మంగళమే యగును, అయినను మీకు గల సందేహముల ప్రశ్నింపుడు. దానికి ఉన్నదున్నట్లుగా తగిన సమాధాన మొసంగెదము.

అనగా పర్వతరాజులు వరుసగా నొకరొకరు ఈ క్రింది విధమున ప్రశ్నింపసాగిరి.

8-9 పర్వత :- మాలో కొందరు పామరులు శివుడు స్మశానవాసుడని యందురు. మీరు చెప్పినంత ఘనుడయిన మహేశ్వరుడు అక్కడ నివసించుట కేమి కారణమో యని మా సందేహము.

తస్మిన్ స్మశానే శివఏవ శిష్యతే తదేవ దేవస్య స్మశాన
వాసం, మహాచ్ఛ్మశానం కిల వారణాసీ, న కేవలం మానవ
దాహ్యభూమిః॥ 8–9

(పృచ్ఛా) చితిస్థ భస్మే త్యశుభం న శౌచం, కథం స్వదేహే
ప్రవిలేపితం సః, (మున) సర్వం హి భస్మాణు విధం కృతం
త, త్పునశ్చ సృష్టుంకిల బీజభూతం, దధార దేహే సచితోత్థ
భస్మ. నో చేదసే కాండ భవం కుతోఽగాత్॥

బృందాసతీదేవి చితౌహి విష్ణు ర్లుఠన్ శివాద్ద త్తసుబీజజాతం,
తరౌ తులస్యాంకిల వర్తతే సద్బ్రహ్మాదిభిస్తేన సుపూజ్యతే
తత్॥

తస్మాల్లమృద్భస్మ విలేపనేన, పాద్మే పురాణే కిల ముక్తి
రుక్తా, తస్మాచ్చితావాసిన ఏవ దేవా, చితస్థభస్మైవ విలేప
నార్హాః॥ 10–11–12

మునులు :- ఆ శ్మశాన మనునది మన మెరిగిన రుద్రభూమి కాదు, ప్రళయకాలమం దా శివుడు రుద్రుడై బ్రహ్మేంద్ర విష్ణ్వాది సమస్తలోకములను భస్మము చేయును. దానినే మహా స్మశాన మందురు, అచ్చట శివు డొకడు మాత్రమే నిలిచి యుండును. కావున నాతనిని స్మశానవాసి యని యందురు. మీకు తెలిసిన కాశి యను క్షేత్రము. సహితము మహా స్మశానమే కదా. కావున నదే శివునకు ప్రళయకాలనిలయము యగును. అంతమాత్రమే కాని మనుష్యులను తగుల వేయుచోటు మాత్రమే కాదు.

10-11-12 పర్వత :- చితియందు గల భస్మము అశుభము. మడికి పనికిరానిది గదా. అట్టి చితాభస్మమును తన దేహమంతయు శివుడు ధరించునందురు. దాని కేమి కారణమన -

మహర్షులిట్లనిరి :- అది మనకు తెలిసిన స్మశానము కాదని యిదివరకే చెప్పితిమి, ఆ చితిభస్మమందు సర్వలోకములును అణువుల రూపమున కలవు. దానికే భస్మ యని పేరు, అట్టి యణువులను మరల సృష్టికాలమువరకును బీజములవలె దాచుటకు వేరుచోటు లేనందున శివుడు తన దేహమందే ధరించెను, అవి లేనిచో మరల సృష్టి యగుటకు మూలము లేదు గదా! దానికే చితా భస్మలేపన మందురు. ఎట్లయినను నది చితిభస్మమే కదా యని యందురా ? వినుడు. అది ధరింపనివా రెవరు ? విష్ణ్వాదు లందురా ? అదియును పొరబాటే. బృందాదేవిచితి యందు పడి విష్ణుదేవుడు పొర్లాడుచుండ శివుడు సతీదేవిచే బీజముల పంపెను. అవి యా స్మశానమందు చల్లగా తులసీ వృక్షము లయ్యెను. బ్రహ్మాది దేవత లందరును ఆ వృక్షమందున గల విష్ణును పూజించి తన్మూలమృద్భస్మమును ధరింతురు. ఇటుల చేసిన ముక్తియని పద్మపురాణమున కలదు. గావున చితాభస్మమే సర్వులకును విలేపనార్హ మయ్యెను

మహాశ్మశానే నటనం కిమర్థం ఢక్కా నినాదేనతు కిం ప్రయోజనం, (మున) విశ్వం హి సృష్టం కిల విశ్వనాథ, స్వదేహబీజాణు విసర్జనార్థం॥

నాట్యం కృతం వ్యాకరణార్థ మస్య, ఢక్కాచ సర్వం నిజ శక్తిరూపం, తయోః ప్రభావా దఖిలాండకోటి బ్రహ్మాండ సృష్టి స్సమభూ త్పునశ్చ। 13-14

(పర్వ) దిగంబర శ్శంభు రితి ప్రసిద్ధిః, కుతోఽభవ త్తద్వ దతాం శివస్య, (మున) దిగేవ తస్యాంబరభూత ఆసీ చ్ఛివస్య తస్మిన్ ప్రళయే న చాన్యః, 15

(పర్వ) కపాలమాలాఽశుభ శల్య కారణం, కిమర్థ మస్యేతి వదంతి మామకాః, ధాతుర్లయే విష్ణు రహం తథైవ, విష్ణో ర్లయే శంభు రహః ప్రవర్తతే।

లయేఽపి తద్బ్రహ్మకపాలవేదం ధర్మాఖ్య మేవాస్తి హరే శ్చ తౌ సః, కంఠేతు తద్బ్రహ్మకపాలమాలాం, కరేతు కంకాళ ముపేంద్రశల్యాన్।

13-14 పర్వత :- అట్టి స్మశానమున నితరు లెవ్వరును లేరుగదా! నిర్జన ప్రదేశమున శివుడు నర్తనము చేయు టెందులకు ? ఢక్కా వినాదముచే ప్రయోజన మేమి ? దాని నెవరు చూచి సంతోషింతురు ?

మునులు:- ఆ తాండవ మనునది సృష్టికాలమున బ్రహ్మాండములను సర్వలోకములను మరల సృష్టించుటకనియు. ఢక్కా వినాదము వ్యాకరణ మూలార్థమనియు నీ సర్వమును పరాశక్తిని ఆధారము చేసికొని - ఆమె సాక్షియై చూచుచుండ నాట్యమాడి ఆ భస్మాణువుల రాల్చుటకై ఆచరించిన లీలావిశేషము మాత్రమే. అటుల నాట్యమాడనిచో అకర్తయగు తానే సృష్టికి కారణుడు కావలసివచ్చును. అందువలన నటు లాచరింప అట్టి రాలిన భస్మాణు బీజములచే అఖిలాండకోటి బ్రహ్మాండములను మరల జనించెను. దీనికే శివతాండవ మని పేరు. అచ్చట నున్నవారంద రాతని అవయవములే కాని ఇతరులుకారు.

15 పర్వత :- మరి యాతనికి దిగంబరుడను ప్రసిద్ధి ఏల కలిగెనన-

మునులు :- ఆ సమయమున దిక్కులే శివునకు అంబరప్రాయములుగ నుండుటవలన నా పరమేశ్వరున కట్టి నామ ముచితమే యగును. ఇతరులకు కాదు.

16-17-18 పర్వత:-మావారు కొందరా శివుడు కపాలమాలను ధరించునని యును, శల్యములు చేతనుంచుకొనునని వింటిమి. అది యేల యని యడుగుచున్నారు. చెప్పుడనగా -

మునులు సమాధానము చెప్పుచున్నారు :- ఇది మహాగోప్యము. అయినను వినుడు అనేక పర్యాయము లీ సృష్టి నశించినచో బ్రహ్మ కొక దినము. అట్టి బ్రహ్మ లనేకులు చెల్లినగాని విష్ణుదేవున కొక దినము కాదు. ఒక్కొక్క బ్రహ్మాండమునకు ఒక్కొక్క బ్రహ్మయు విష్ణువును కావలయును. రుద్రునకు ప్రళయమే లేదు. కావున మరల సృజించుటకై బీజములగు వేద

రరక్ష రుద్రైః ప్రళయేతు సృష్ట్వా, పున స్స్వపార్శ్వాచ్చ
ప్రసృజ్య తేజః, హాతేశ్చ శంఖం దివిజాయుధాని, తత్
పాంచజన్యం మునిశల్యజాతం॥ 16-17-18

(పర్వ) భూతాధిప శ్శంకర ఏవ నాన్యః, కిం నీచసేవ్యం పర
మేశ్వరస్య, (మన) పృథగ్విధభూతా స్సచరాచరాశ్చ,
తస్యాధిపత్యేన చరంతి లోకాః॥

తేషాంతు ముఖ్యో హరిరేవ సాక్షాత్, (ఏకో విష్ణు ర్మహ
ద్భూత మిత్యుక్త్యా) పృథక్పృథః కోట్యఖిలాండ భూతాః,
భూతాధిప శ్శంకర ఏవ నాన్య, స్స ఏవ సృష్టౌచ లయేచ
కర్తా॥ 19-20

(పర్వ) వ్యాఘ్రచర్మ సుదుకూలధారణం, వ్యాళకృత్తి
వసనం పరిధానం, క్రూరసర్ప విషభూషణానితు, కిం వరంహి
పరమేశ్వరస్యతు॥ 21

రూపమగు బ్రహ్మకపాలములను శివుడు తన మెడలో మాలగను విష్ణుదేవుని ధర్మరూపశల్యములను కంకాళమను పేరిట హస్తమందున ధరించి రక్షించి యుంచుకొని మరల సృష్టికాలమందు తన దేహోభయ పార్శ్వములచే వారల శివుడు సృజించుచుండును. అట్టి బ్రహ్మ విష్ణు బీజములే కపాల కంకాళములు. మరల నెట్టులయిన నవి శల్యములే గదా యని యందురా ? వినుడు. శల్యముల ధరింపనివారెవరు : సాక్షాద్విష్ణుదేవుని చేతనున్న శంఖము పంచజనుని కంఠశల్యము, దేవతల ఆయుధము లన్నియును దధీచి శల్యములే యగునుగదా. దీని కేమి చెప్పెదరు ? కావున నవి దివ్యములు. వాటికి దోషము లేదు.

19-20 పర్వత :- శంకరుడు భూతాధిపతి యని పిలుతురు గదా. అట్టి మహానుభావున కా నీచసేవ యేల ? మహాత్ములు లేరా ? యన మునులు బదులు పలుకుచున్నారు. భూతములన పిశాచములు మాత్రమే కావు. పృథ్వ్యాది సర్వ చరాచరము లన్నిటికినీ భూతములనియే పేరు. అవన్నియును శివుని యాధిపత్యమునవే ప్రకాశించును. అందు ముఖ్యుడు శ్రీమహావిష్ణుదేవుడు. (ఏకో విష్ణుం మహద్భూత) మని కలదు గదా. మిగిలిన వన్నియు సామాన్య భూతములే యగును. కావున సర్వభూతాధిపతి శంకరు డొకడు మాత్రమే. ఆయనవలననే సృష్టిస్థితిలయములు వాటి కేర్పడును.

21 పర్వత :- ఇవన్నియు బాగుగనే ఉన్నవి. కాని శంకరుడు పులి చర్మమును ధరించి పచ్చి గజచర్మమును పైన వేసుకొనునని యును, కౄర విషసర్పముల ధరించునని యు నందురే. దానికి కారణ మేమై యుండునో చెప్పుడు అవి అందమయినవని, శ్రేష్ఠమయినవని యా శివుడు వాటినే ధరించునా-

(మున) దారుకావన మునీంద్ర సత్తమో, వ్యాళ వ్యాఘ్ర
వసనే సజీవితే, ఆదిశేష సహితాష్ట పన్నగై, ర్భూషితో
మణిసువర్ణ గంధైః॥

తేషు ఏక అఖిలాండధారకో, దుగ్ధసింధు హరివాహక
స్స్వయం, తాదృశా న్యఖిలలోక ధారకాన్, ధారయత్యఖిల
వాహక శ్శివః॥

దంశతీతి భయతో న ధార్యతే, వ్యాళతశ్చ బత సుందరం
నహి, సర్వరూప మతఏవ హి లోకా, స్స్వర్ణరత్న సువి
భూష తత్పరాః॥ 22-23-24

పృథ్వ్యాదికా హ్యష్టవిధా హ్యవిద్యా,విమాత్మికా స్తత్ప్రకృ
తీ శ్శివస్తు, దధార దేహేతు విచేతనార్థం, విమస్వరూపా
ప్యమృతాశ్చ భూషాః॥ 25

(పర్వ) వాహనాని కతి సంతి న లోకే, వృద్ధపంగుః వృషభః
కిముతస్య, (మున) ధర్మఏవ వృషభ స్సనాతనః, కాలత
స్సతు పంగురివేతి హి॥ 26

22-25 మునులు :- పూర్వము దారుకావనమందు గల మహర్షులు తమ తపోగర్వముచే శివుని జయింపవలయునని వారి తపమంత యును వ్యాఘ్రమువలెను ఏనుగువలెను కల్పించి శివునికడకు పంపిరి. తపోమయుడగు నా శివుడు వాటి పయిచర్మములు మాత్రి మా యాకారముతో నుండెను గాని లోన తపమే గావున వాటి నా విధమున ధరించి వారిని విస్తేజస్కులగావించెను. ఆయనధరించిన సర్పములను కప్పలనుతిను పాములుకావు. ఆదిశేషుడు మొదలగు అష్టమహాసర్పములు. మణిసువర్ణ వర్ణములు. సుగంధమయములు. వాటిచే శివుడు భూషింపబడెను. వాటిలో నొక సర్పము క్షీరవారిధి యందు మహావిష్ణుదేవుని ధరించుచున్నది. అట్టి యఖిలాండకోటు లను ధరించు వాటిని ధరింపగలవాడు శివు డొకడే గాని తదితరులు కారు. లోకమందయినను సర్పములు కరచునను భయముతో వాటిని స్పృశింపరు గాని అంతకుమించిన చక్కదన మే వస్తువు నకును లేదుగదా. కావుననే మనవారు బంగారముచే నాగరములను, ఉంగరములను వాటి స్వరూపమున ధరించుచున్నారు. ఆ సర్ప ధారణ రహస్య మేమందురా ? వినుడు. అవ్యక్తాది పృథ్వ్యంతాష్ట విధావిద్యా ప్రకృతులే యగును. అవి మోక్ష ప్రతిబంధ కారణము లగుటచే విషప్రాయములు. అవి శివుని దేహమం దమృతప్రాయ ములై యుండుటయే గాక నాయా ప్రదేశములకు తగిన భూషణ ప్రాయములుగా నున్నవి. అవి యచేతనము లయినను శివుని శరీరస్పర్శచే చేతనము లయ్యెను. కావున వాటిని శివుడు ధరించెనని అర్థము.

26 పర్వత :- లోకమం దనేకవాహనములుండ సదాశివుడా కుంటి ముసలిఎద్దును మాత్రమే వాహనముగ నేల స్వీకరించెనన-

చంద్రచూడ ఇతి కథ్యతే కథం, పుష్పగంధ విముఖః కిముదేవః, (ముచ) ఓషధీశ ఘనచంద్ర గంధవ, న్నాస్తి శీత మిళరేషు న ప్రభా॥ 27

శృణుత పర్వతరాజ మహేంద్రా ! ఈశ్వరస్యతు వస్త్ర విభూషణే, జీవయుక్త మితరేషు తన్నహి, తేన జీవతి కిలా ఽఖిల లోకాః॥ 28

(పర్వ) విరూపనేత్రత్రియ ధారణేతు, కిం కారణం సూర్య శశాంక వహ్నీన్, (మున) బ్రహ్మైవ సూర్యో హరిరేవ చంద్రో, రుద్రోగ్ని రేవస్య త్రినేత్రభావాః॥

సృష్టించ రక్షార్థ మశేషలోక, నాశార్థ మస్యైవ త్రిణేత్ర భూతాః, నాన్యేషు తస్మా చ్ఛివయేవ సాక్షా, త్త్రిమూర్తి రూపః పృథగేతరాశ్చ॥ 29-30

(పర్వ) భిక్షాటనం స్వీయ గృహేపి తస్య దారిద్ర్య వేషశ్చ కుతో హరశ్చ (మున)స్వీయేతరాణాం సుకృతం పరిగృహ్ణన్ భిక్షా స్వరూపేణ దదాతి ముక్తి॥ 31

మునులు :- ఆ వృషభము ధర్మదేవత. అది సనాతన మగుటచే ముసలిదియు నగును. యుగప్రభావమున త్రేత ద్వాపర కలియుగ ములయందు మాత్ర మొక్కొక్క పాదము కుంటిదగును. ఇది శ్రీ రాము డవతరించిన త్రేతాయుగము కదా ! అట్టి ధర్మమును సదాశివుడు ఎడబాయని వాహనముగ జేసికొనెను.

27_28 పర్వత :- పరమేశ్వరుడు చంద్రుని తన శిరమున ధరించు నందురు. అది యేల ? పుష్ప గంధ భూషణ ధారణమం దిష్టము లేకనా మరేమి ? యన -

మునులు : పుష్పములు ఓషధీశభవములు. సర్వోషధీశు డగు చంద్రునకు గల ప్రకాశ సుగంధ శీతలత్వములు వాటికి లేవుగాన గాన - యని పలికి - ఓ పర్వతేశులారా ! ఒక ముఖ్యవిశేష మును వినుడు ఈశ్వరుడు సర్వజ్ఞుడు. ఆ మూర్తి ధరించిన వస్త్ర భూషణాదు లన్నియును సజీవములే యగును. ఇతరుల కెవ్వరికినీ అట్టివి లేవు. ఆయనసంబంధము కలవి కావున ఈ యఖిలాండ కోటిబ్రహ్మాండము లన్నియును చేతనములవలె ప్రకాశించు చున్నవి. ఇదియే శివుని భూషావిశేషము.

29_30 పర్వత :- శివుడు వికారముగ ముఖమందు మూడు నేత్రములు ధరించునందురు గదా ! దానికి కారణమేమి ? యన -

మునులు :- అందు సూర్యనేత్రమే బ్రహ్మ. చంద్రనేత్రమే శ్రీ మహావిష్ణువు. అగ్నినేత్రమే రుద్రుడు. వారు ముగ్గురును ఈశ్వ రునకు సృష్టిస్థితినాశము లొనరించు నేత్రప్రాయులు. కావుననే సాక్షాత్పరశివుడు సృష్టిస్థితినాశ కారకుడు. ఇతరుల కా యధికా రము లేదు. గాన తదితరుల కట్టి మూడు నేత్రములును ఉండవు. కావుననే సదాశివుడు త్రిమూర్తిస్వరూపు డగును.

31 పర్వత :- శివుడు తుదకు తన యింట తన భార్యచే సహితము భిక్షము స్వీకరించునట గదా ! అతని కా దారిద్ర్యవేషవృత్తి లేల ? యనిన మునులు వారి కిటుల చెప్పుచున్నారు.

దరిద్రవేషోఽపి దదాతి సంప, చ్ఛ్మశానసద్మాపి స విశ్వనాథః,
కాల రుద్రోఽపి శివస్స్వరూప, శ్శివస్స్వ రూపాది న వేత్తి
మూఢాః॥ 32

(పర్వ) శివస్య నిర్మాల్య పరిగ్రహంతు. న కామయంతిస్మ
కిమత్ర కారణం, (ముని) శివస్య నిర్మాల్య మహా ప్రు మర్హా,
స్సర్వే న లోకేతు వినాతదీయైః॥ 33

(పర్వ) ఇత్థంప్రసిద్ధం శివవైభవం హి, కుత్రోచ్యతే నాస్తి
పురాణశాస్త్రే, (ముని) తదేవ మాహాత్మ్యం దశభిః పురాణై
శ్శివస్య విష్ణోశ్చ చతుష్టయేన॥

ద్వయోశ్చ బ్రహ్మ భువనేశ్వరీచ, తథేతరే తద్వ్రతయే
ప్రసిద్ధాః, తథాపి తద్రూప విమర్శనార్హా, స్సర్వేపి లోకే న
వినా తదీయైః॥

దృష్ట్వా కిలోమా పరిపృచ్ఛతాం తాం, శివస్వరూ
పాధిక మత్ర సాక్ష్యం, (హిమవాన్) ఉక్తం హి సా లోక
విడంబనార్థం, పృచ్ఛామ కన్యాం పరివృణీష్వ మార్యా॥

మునులు :- తన కితరు లయినవా రందరి పుణ్యమును భిక్షాటన ముచే శివు డార్జించి తుదకు వారి పాపముల పోద్రోలి ముక్తి నొసగును. అదియే శివుని భిక్షాటనము.

32 ఇతరులకు తన యైశ్వర్య మొసగువా డాతడే యగును. తాను స్మశాన నివాసియైనను విశ్వనాథుడును, ప్రళయక ర యగు రుద్రు డయినను భక్తజనులకు మంగళప్రదాత యతడే యగుననుట నిశ్చయము. శివుని యథార్థరూపమును మూఢులు తెలుసుకొన లేరు.

33 పర్వత :- లోకమం దెవ్వరును శివ నిర్మాల్యమును స్వీకరింపరు. దానికి కారణ మేమై యుండును అన -

మునులు :- శివనిర్మాల్య మా శివభాగవతాంతర్య భక్తులు తప్ప తదితరులు స్వీకరించుట కనర్హులు. కావున నది గయావటపత్రము వంటిది. పనికిరాదనుట తప్పు.

34-37 ఇట్లు సుప్రసిద్ధమయిన శివవైభవ మెచ్చట చెప్పబడినది? మేము చూచిన పురాణములలో నెచ్చటను కనబడలేదు, శాస్త్రము లయం దసలే లేదు. అన -

మునులు :- ఇట్లు మాటలాడుటకే మూఢత్వమని పేరు. అష్టాదశ పురాణములలో (10) పదిచే నీశ్వరుడును (4) నాలుగుచే, విష్ణు దేవుడును 2 చే భువనేశ్వరియు, సూర్యగణపతులు 2చే చెప్పబడిరి. ఇట్లయినను శివభక్తి లేనివారికి అసలా శివపురాణాదులు విమర్శనా ర్హములే కావు. విమర్శింపబూనినను శివేతరభాషల కవి గోచరింపవు. అవి చెప్పి మునులు ఓ హిమవద్భూమిపాలా ! ఇంత యేల ? సాక్షాత్పరమేశ్వరదివ్యస్వరూపమును నీ పుత్రిక యగు పార్వతీదేవి చూచెనుగదా ఆమె నడిగి తెలుసుకొనుడు. మీ సందేహ నివారణమున కామెయే సాక్షి కాగలదనిన - ఆదరమున హిమవత్పర్వతుడు మహర్షులతో నిట్లనుచున్నాడు.

(శ్రీసూతః) ఇత్యుక్త్వా హిమవాన్నేనాం ప్రీత్యా ముఖమవైక్షత; కన్యాదానేతు భార్యాయా భావో గ్రాహ్యః ప్రధానతః॥ 34 35, 36, 37

తచ్ఛ్రుత్వారుంధతీ మేనా మువాచ మృదులస్వరా,
లోకేప్యేవం విధే కార్యే స్త్రీణా మేవ ప్రగల్భతా॥

స్వయ మభ్యంగనం కృత్వా పార్వతీ తదనంతరం,
వృణీమ ఇతి తత్కృత్వా భూష యిత్వాంబరై స్స్వమైః॥

అంక మారోప్య తాం కన్యాం లజ్జమానా మరుంధతీ
వసిష్ఠాదిమునీ నాహ వృణీధ్వం సంశయం నచేత్॥

తచ్ఛ్రుత్వా మునయ స్సర్వే ప్రోచు స్తే పర్వతాధిపాన్,
నిర్దోషస్య శివస్యాఽపి కౌతుకేనాపి దూషితాః॥

వయంతు కన్యా విషయే పృచ్ఛామ స్సంశయాన్ తథా,
కథం వృణీమ మాహేశీం పుంభావాది గతాం భవాం॥

38- 42

అయ్యా ! మీరు చెప్పినదంతయును సత్యమే యగును. ఆమెయు నిటులే మాకు చెప్పినది. మావారయినను సామాన్యముగ నందు లోకాచార మనుసరించి ప్రశ్నించిరి గాని వేరుభావమున కాదు. మీ శంకరునికి భార్యార్థమై మా పార్వతిని వరింపవచ్చును. అని చెప్పి మేనకాదేవి ముఖమును చూచెను. ఏల యన కన్యాదాన మందు ఎంతవాని కయినను ముఖ్యముగ భార్యాభావము గ్రహింప వలసినదే గావున,

38_42 సూతః _ ఆ మాటలను విని అరుంధతీదేవి మృదు మధుర స్వరముతో మేనకాదేవిని చూచి భావగర్భితముగ నిట్లనెను.

కన్యావరణమున కింతమాత్రమే చాలదు సాధారణముగ నీ విషయ మునకు పురుషులు పనికిరారు. స్త్రీలకు మాత్రమే అర్హము కావున నేను పార్వతీదేవికి స్వయముగ అభ్యంగన మాచరించి అలంక రించి పిదప వరింపవచ్చునని చెప్పినగాని ఈ కార్యము పూర్తి కాజాలదు. నే నందులకే గదా వచ్చుట - యని బంధుసుమంగలీ నివహముతో నా పార్వతీదేవికి అభ్యంగన వస్త్రాద్యలంకారము గావించి సిగ్గుపడుచున్న పార్వతీదేవిని తన యంకమందు గూరు చుండజేసికొని _ మహర్షులారా ! మీరీ కన్యను శివార్థమై వరింప వచ్చును. సంశయములున్న వారి నడిగి తెలుసుకొను డనెను.

అది విని మహర్షులు పర్వతరాజులతో సంతోషముతో నిటుల పలికిరి :_ ఓ హిమవన్మహారాజా ! ఏ విధమయిన లోపమునులేని పరశివుని కౌతుకార్థముగా నయినను మీ రనేకవిధముల శంకించి దూషించి మాచే సమాధానము చెప్పబడి తుదకు తృప్తి చెందితిరి. ఇక మేమును ఆ విధముననే మీ కన్యకను శంకించి ప్రశ్నించె దము. మీరు దానికి సమాధానము చెప్పుడు. మీ కన్యయందు కన్యా భావమే లేదు. కూడని పుంభావములును గలవు. ఆత డభవుడు. ఈమె శివ. కావున మే మెటుల ఈ కన్యను శివార్థము వరింప గలము ! ఆ భావము లేవందురా ! వినుడు.

(మున) శ్యామలాం వింధ్యసదనాం రక్తదంతాంచ భ్రామరీ
కూష్మాండాంచ సహస్రాక్షీం శతాక్షీం భీమరూపిణీం॥
దుర్గాం శాకంభరీం కాళీం కపాలాభరణాం భయాం,
మధుకైటభసంహర్త్రీం శుంభదైత్య వినాశినీం॥
మహామాయాం మహామారీం మహాశక్తిం క్షుధాం తృషాం,
నిద్రాం నిశాచరీం చైకవీరాం ఘోరాం దిగంబరాం॥

సింహశార్దూలతురగాం స్వతంత్రాం జగదాత్మకాం,
యుష్మత్కన్యాం వదంతీత్థం త్రిలోకేషుచ సజ్జనాః॥

ఏతేషు చాభిధానేషు కుతః కన్యాత్వ ముచ్యతాం,
కథంశివార్థం వృణుయాం సాంప్రతం ముగ్ధరూపిణీం॥ 43-47

వైయాప్య సానురాగ్యం వదం త్యత్రతు పండితాః,
నామ్నా చై[illegible]పి సా[illegible]ః కన్యాత్వం సుతరాంనహి॥ **48**

(శ్రీ సూతః) తచ్ఛ్రుత్వా పర్వతశ్రేష్ఠో హిమవా నబ్రవీ
దిదం. సర్వజ్ఞాః పండితా యూయం సామాన్యా మాదృశా
స్మృతాః॥ 49

43-47 1. ఈమెవర్ణము నలుపు. 2. వింధ్యపర్వతవాసిని. 3. రక్త ముతో తడిసిన దంతములు గలది. 4. భ్రామరి, 5. చండముండా దులను వధించిన చాముండి, 6. సహస్రాక్షి, . శతాక్షి, 8 భయం కరమూర్తి, 9. దుర్గాసురుని సంహారించిన దుర్గా, 10, శాకంభరీ 11. కాళికాదేవి, 12, కపాలాభరణ, 13. భయమని ఈమెకు పేరు. 14. మధుకైటభులను సంహరించెను. 15. శుంభ నిశుంభులం జంపెను. 16. మహామాయ, 17. మహామారి, 18. మహాశక్తి. 19. ఆకలి యని ఈమెకు పేరు. 20. దాహము. 21. నిద్ర, 22. రాత్రులందు సంచరించెడిది, 23. జగదేకవీర. 24. ఘోర రూపిణి, 25. దిగంబరి, 26. సింహము శార్దూలము మొదలయిన క్రూరజంతువుల నారోహించెడిది, 27. స్వతంత్ర, 28. జగత్తు ఈమెస్వరూపము. ఇంతవరకు చాలును. ఈ విశేషములు శివుని పామరులు నిందించినటులగాక మూడులోకముల యందుగల మహా పాదుకాంత దీక్షితపండిత సజ్జనులును సత్యముగా నిరూపించి పల్కెదరు. ఈ విధమగు నామభావాదులలో కన్యాత్వము యెంత వెదకినను యేమాత్రమయిన కలదా ? మీరే చెప్పుడు. ఇట్టి మీ కన్యను సర్వోత్తముడయిన శివునకు భార్యనుగ నెటుల వరింప గలము? ప్రస్తుతము మాత్రము చూచుటకు యేమీ తెలియని ముగ్ధ భావమునను న్నను తెలిసినవారము మేము పొరపడెదమా? చెప్పుడు.

48 మా పరశివుడు పామరులకు నిరూపముగనే కనుపడును. స్వభావ ముచే సర్వసుందరుడు. మీ కన్యమ మేమన్నటులే వంతుల సహిత మందురు గదా !

49 (శ్రీ సూతుడు) ఆ మహర్షుల మాటలను విని హిమవంతుడ వారితో నిటుల పలికెను. అయ్యా ! మహానుభావులారా ! మీర సర్వజ్ఞులు, పండితులు. మేము సామాన్య రాజన్యులము, మీక మేము సమాధానము చెప్పగలమా ? అయినను మాకు తెలిసినంత వరకును చెప్పుచున్నాము. ఆలకింపుడు.

ఏతత్సర్వం పురాణేషు తద్విద్భిశ్చ వయం శ్రుతాః,
తత్సమాధాన మత్రైవ పురాణేష్వేవ పశ్యతాం॥ 50

అస్మత్సుతా కోమలరాజకన్యా, బాలాఽబలా శంకర సమ్మతాహి, అపర్ణనామ్నా ప్రథితా మునీంద్రాః, పూర్వా వతారోక్త మశేషమన్యత్॥

ఏతేఽ కిం సప్తమహామునీంద్రాః, స్సారుంధతీ కా స్వవివా శ్శివస్య, త్రిలోక సౌందర్యయుతాం తు మత్సుతాం, ప్రత్యక్షతః పశ్యథ సంవృణీధ్వం॥ 51-52

(శ్రీ సూతః) ఇత్యుక్తే పర్వతే తేతు సారుంధత్యా మహర్షయః, మిథః పరస్పరం పశ్యన్ పర్వతానూచిరే హసన్॥ 53

(మునయః) శివో వరో తస్య ప్రియైవ కన్యా, భవాన్ప్రదాతా చ వయం ప్రసిద్ధాః కులం పవిత్రం హరిరేవ బంధుః, పితా త్వయం కశ్యప ఏవ సాక్షాత్॥ 54

విశ్వంహి పార్వతీ సాక్షా ద్విశ్వనాథో మహేశ్వరః,
అనంతగుణపూర్ణౌ తౌ కుతో యాచాము వయం ప్రభో॥ 55

తథా పితౌ విశ్వసుమంగళార్థం, లీలా వివాహం ప్రచరంతి ద్వైతం, ఏకోఽపి సన్నద్వయ బ్రహ్మసాక్షా, త్తత్సేవయా త్వంచ వయం కృతార్థాః॥ 56

50 మీరు చెప్పిన విశేషము లన్నియును మా బాలకు పూర్వావతార కృత్యములని పురాణములందు గలదని మీబోటివారు చెప్పగా మేమును వింటిమి. కాని వాటికి సమాధాన మా పురాణములందే విమర్శించి మీరే తెలుసుకొనుడు. ఇక మాకు తెలిసినదేమందురా ? దయచేసి వినుడు.

51_52 హిమవంతుడు :- నా గారాబుకూతురగు పార్వతి కోమలమగు రాజకుమారి. ఏమియు తెలియని బాలిక. తెలివితక్కువగలదై నను శంకరుని గూర్చి అపర్ణ యను నామము వహించి తప మాచరించి శివునిచే నిన్ను భార్యగా స్వీకరింతునని వరము వడసినది. మీరు చెప్పిన వన్నియును మాకు తెలియని ఆమె పూర్వావతార కృత్యములై యుండును. త్రిలోకసుందరి యగు మా పార్వతిని మీరు ప్రత్యక్షమున చూడుడు. శివునకు భార్యార్థమై వరింపు డనెను.

53 సూతుడు చెప్పుచున్నాడు :- ఓ శౌనకాది మహర్షులారా ! వినుడు. ఆ సప్తర్షులు నరుంధతియును ఆ పల్కు లాలకించి పరస్పరము భావగర్భితముగ చూచుకొని విశ్చయించుకొని నవ్వుచు హిమవంతుడు మొదలగు పర్వతేశులతో నిట్లనిరి.

54_56 ముని:- సాక్షాద్వరుడు మంగళస్వరూపుడు. ఆయనచే పార్వతీదేవి ఇదివరకే వరింపబడినది. మీరు కన్యాదానము చేయుటకు సిద్ధముగా నున్న కన్యాదాతలు. మా సంగతి అందరకును తెలిసినదే కదా ! మీ కులమా ? పవిత్రమయినది. సాక్షాన్మహావిష్ణుమూర్తి మీకు బంధుప్రాయుడై యున్నాడు. మాలో నొకరగు కశ్యపుడే మీ తండ్రి. అంతమాత్రమేకాక ఈ ప్రపంచమే పార్వతీదేవి ఈ విశ్వమున కా శివుడే నథుడౌటచే విశ్వనాథుడు. వా రుభయులు ననంత సద్గుణసంపూర్ణులు. ఈ సంబంధ మౌననుటకు, కాదనుటకు మన మెంతటివారము. యథార్థమున వా రుభయులును, ఏకస్వరూపమే

(శ్రీ సూతః) ఇత్యుక్త్వా పర్వతా స్స్వీత్య సారుంధత్యా
మహర్షయః, వృణీమ ఇతి తే ప్రోచు ర్వైశ్వకల్యాణహే
తవే॥ 57

వైవాహికసులగ్నం హి పృష్టవా న్స హిమాద్రిరాట్,
ఫాల్గునే పూర్ణిమాచేతి జ్ఞాత్వా సర్వే ముదం యయుః॥ 58

హిమవాం స్తాంశ్చ సప్తర్షీ నరుంధత్యా సహాత్మవాన్,
మేనకా సహిత స్సుష్ఠుః పూజయామాస సాదరం॥ 59

తేషు గత్వాతు మునయో స్సర్వాం సంశ్రుత్య శంకరం,
సేవా భాగ్యం ప్రదత్తే న్నో విద్యమానార్థ కోటిషు॥

వయం కృతార్థా ఇత్యుక్త్వా నమస్కృత్యాచ శంకరం,
ఆకాశమార్గా త్తే సర్వే జగ్మ ర్నక్షత్రమండలం॥ 60-61

మాల్యవత్పర్వతోద్యానే న ద్య నారసింహానధారినా.
కృతః సప్తర్షి సందేశం రామచంద్రస్య ప్రేరణాత్॥ 62

ఇతి శ్రీపార్వతీపరమేశ్వర కల్యాణవైభవే సప్తర్షి
సందేశో నామ ద్వితీయ స్సర్గః.

---

అయినను విశ్వమంగళార్థమై ఇటుల రెండు రూపములు ధరించి లోకకల్యాణ మొనగూర్తురు. అట్టి సాక్షా దద్వయావ్యయ పరమాత్మసేవ కొంతవర కొనర్చి మీరును, మేమును కృతార్థుల మయితిమి అని పల్కిరి.

57 ఆ మహర్షు లటుల పలికి పర్వతేశులను జూచి అరుంధతీసహితులై విశ్వకల్యాణార్థము మీ పుత్త్రిక యగు పార్వతీదేవిని పరమేశ్వరునకు భార్యగా వరించితిమని ముమ్మారు పెద్ద గొంతుకతో పలికిరి, ఆకాశమందు దేవతలు తథా స్తనిరి.

58 అంత వైవాహికలగ్న మెప్పుడు నిశ్చయించితిరని హిమవంతుడు పలుక వారు – రాజా! ఈ ఫాల్గునమాస పూర్ణిమనాడు అభిజిల్లగ్నమని పలుక కన్యాపక్షమువారు అందరును సంతోషించిరి.

59 అంత హిమవంతుడు భార్యాసహితుడై అరుంధతీదేవిని, సప్తర్షులను యథార్హముగ పూజించి సంతోషపడెను.

60-61 ఆ మహర్షు లరుంధతీదేవితో మరల కైలాసమునకేగి సర్వము నివేదించి మీ కనేకులు భక్తభాగవతాదులు సేవకులుండగ మాకీ సేవాభాగ్య మొసగి కృతార్థుల గావించితిరి. కావున మేము ధన్యుల మయితిమని నమస్కరించి శివాజ్ఞను గైకొని వారంద రాకాశమార్గమున వారి వారి యథాస్థానములకు నక్షత్రస్థానములందు ప్రవేశించిరి.

62 ఆని యీ విధమున సాక్షా చ్ఛ్రీరామచంద్ర ప్రేరణచే ములుకుట్ల నరసింహావధాని పాకయాజి యను భక్తుడీ సప్తర్షిసందేశమును రచించెను.

ఇట్లు శ్రీ పార్వతీ పరమేశ్వర కల్యాణవైభవమందు సప్తర్షిసందేశమను రెండవ సర్గము పూర్తి యయ్యెను.

# అథ హైమవతీ పరమేశ్వర దివ్యకల్యాణ వైభవాత్మక తృతీయస్సర్గః

శ్రీ సూత ఉవాచ॥

తతో ఽద్రిరాజ స్స్వసుతా వివాహ, కృత్యే నిమగ్నో నిజ వైభవాద్ధి, కల్యాణసంభార సుమందిరాదీన్ ప్రకల్ప్య సర్వా న్ముముదే సమృద్ధం॥ 1

ఉపాసనా ద్మ్రత్రివచేవ సంస్థం, స్మృత్వా సభార్యం హరి మాగతం సః, ప్రపూజ్య భక్త్యా హిమవా న్స్వతంత్రా, దువాచ వాక్యం విభవప్రగల్భం॥ 2

శివస్య మాతా పితరౌ చ బంధు, ర్న సంతి వై దక్ష మంగళే శతః, ఏకో ఽథవా ద్వ్యాత్రియవేవ ఆగతే, ద్యతో న్మహాన్మే సకథం నియుజ్యారోత్॥ 3

## అథ హైమవతీ పరమేశ్వర దివ్యకల్యాణ వైభవ మను
## తృతీయ సర్గము



1 సూతు డిట్లు చెప్పుచున్నాడు :-

అంత హిమవంతుడు తన కూరిమికూతురగు పార్వతి వివాహ నిమిత్తమైన కృత్యమందు నిమగ్నుడై తనదగు మహావైభవము నకు తగినట్లుగ కల్యాణసంభార మంటపాదుల కల్పించి సంతోషిం చెను గాని – ఐశ్వర్యముచే కాలవశమున గర్వపడెను అంత –

2 ఆ హిమవంతుడు తన బాల్యమందు చేసిన ఉపాసనచే మిత్రుని వలె తన ననుసరించుచున్న విష్ణుమూర్తిని భార్యతో ప్రత్యక్షము కమ్మని ప్రార్థింప వెంటనే శ్రీ లక్ష్మీనారాయణు లరుదెంచిరి. హిమవన్నగరా జా దేవుని భక్తితో భార్యాయుతుడై పూజించి తన వైభవమెల్ల జూపి చనువున స్వతంత్రతచే నిటుల వల్కెను,

3 మహానుభావా నా కొక సందేహము కలిగెను. అదేదందురా ? శివ నకు మాతాపితృ బాంధవు లెవ్వరున లేరని వింటిని. బలగముగల దక్షుడు శివవిరోధి గాన నాతడు ఈ వివాహమునకు రాడు. ఇక నొకరో ఇద్దరో తుదకు ముగ్గురో వరునివెంట వత్తురు. అట్లయిన ఈ గొప్పదయిన నా యత్నము వ్యర్థమగునేమో యని విన శ్రీవిష్ణు దేవు డిట్లనెను.

విష్ణురువాచ॥

తథా నవాప్య శ్శివబాంధవాఖిలా, శివాఽపరాధం ప్రభవే
త్తవాద్య, ఉమాపణం ప్రార్థయ శంకరం త్వం, నోచే
దిదం ప్రాణ శివేతరం స్యాత్॥ 4

అహం బ్రహ్మేంద్రో హ్యదితి దితిసంతాన మఖిలం, నగం
ధర్వా యక్షా హ్యురగప మనుష్యాశ్చ పశవః ఖగా వృక్షా
శ్శైలా స్తృణచయ మహామేర్వాంబు భృతః, స్మహా నద్య
స్సింధు స్సకల మపి తద్బంధు నిచయం॥ 5

శ్రీ సూతః :-

శ్రుత్వాఽపి సంశయాపిష్ట మిదమాహ హరిర్నృపం,
తదేవ శ్రూయతే వాద్యం శివ స్త్వాయాతి సత్వరం॥ 6

ఆనేతవ్య మతశ్శీఘ్రం గచ్ఛం త్వాహ్వానసై పుణాః,
తథేతి రాజా ప్రస్థాప్య చాస్యమాప్త మువాచవై॥ 7

త్వం గచ్ఛ ప్రమార్గా దత్వాత్రి దృష్ట్వా సర్వం నివేదయ,
సర్వంవ్యర్థం భవిష్యంతి వా నవేతి ప్రవేదనే॥

సతుగత్వా సమాగత్య సార్భకస్య బ్రవీదిదం,
ప్రత్యేకైకపద్మీమార్గే గత్వా గతిఖా గఫ్యా॥

4 అట్టినట శివాపరాధమగును. సర్వులను శివుని బాంధవులే సుమీ! నీవు వెంటనే శివునకు మ్రొక్కి క్షమాపణము కోరుము. లేనిచో విదంతయును నమంగళమే యగును, తప్పదు. ఈ నా మాటను వినుము,

5 నేనును, బ్రహ్మేంద్రులును, అదితి దితి సంతాన మంతయును, గంధర్వ, యక్ష, ఖగ, నాగ, వృక్ష, శైల తృణాదులును! అణువు మొదలు మహామేరువుల పర్యంతమును, పెద్ద నదులు, సాగర ములు, మొదలయిన దంతయును శివుని బాంధవులే యగుదురు సుమీ అని చెప్పెను.

6–7 శ్రీ సూతుడు చెప్పుచున్నాడు :–

ఓ శౌనకాది మునీశ్వరులారా ! నారాయణు డటుల చెప్పినను ఐశ్వర్యభావమున ఉదాసీనతలో నున్న పర్వతరాజును జూచి – శ్రీమహావిష్ణు వెట్లు ధోరణి మార్చి పలికెను. రాజా ! అదిగో ! మంగళతూర్యఘోషములు వినబడుచున్నవి, సదాశివుడు శీఘ్రముగ వచ్చుచున్నట్లున్నది మన ఆహ్వానసంఘమువారిని పంపి వారిని వెంటనే యెదుర్కొనజేయుము. అన – పదివేల ఆహ్వానసంఘము వారిని పంపి – యింకను సందేహముచే ఆప్తుడయిన నొక మిత్రుని పిలచి యిట్లనెను. ఓ మిత్రమా !

8–9–10 నీ వీ ప్రత్యేకరహస్యముగు ఏకపదీమార్గమున ఆ వాద్యములు గల ప్రదేశమునకు వెళ్ళి అంతయును చక్కగా పరిశీలించి వారు రాకమునుపే నావద్దకు వచ్చి తెలుపుము. నేను సిద్ధము గావించిన గొప్పదయిన ఈ యత్నమంతయును వ్యర్థమగునా కాదా యని ముందు నేను తెలుసుకొనెదను అని పంప – అతడు వెళ్ళి, తల యును కాళ్ళును సన్నని. పొట్టలావుతో కొంత వికారముగా నున్న కుర్రవానిని వెంటనిడుకొని వచ్చి ఇటుల పలికెను. అయ్యా! నేను యెంతదూరము వెళ్ళినను – దానికంతదూరముగా వాద్యఘోషము

యావచ్ఛ్రదూరం ప్రగతోఽపి శబ్దః, సంశ్రూయతే మంగళ
వాద్యఘోషం, ఏకోఽపి నాగాతి క్వచిచ్చ వృద్ధో వృషాధి
రూఢో గృహయుక్త ఆగాత్॥ 8-9-10

స ఏవ తవ జామాతా తస్య పుత్ర స్త్వయం శిశుః,
బుభుక్షా బాధిత స్తూర్ణ మానీతోఽస్మి తదాజ్ఞయా।
భోజనం దేహి రాజేంద్ర! వరపూజాం తతః కురు,
తథేతి విమనా రాజా పాచకేభ్యోఽర్పయ చ్ఛిశుం॥

మహానసే పాచక షట్సహస్ర, మశక్త మాసీ చ్ఛిశుభోజ్య
దానే, తతః కుమార స్స్వయమేవ గత్వా, శాలాయుతం
భక్షితవాన్ గణేశః॥

తుష్టో న బాలో హ్యవదత్ప్రదేయ మన్నం జలం తండుల
సూప మాజ్యం, శాకాని క్షీరం దధిపాత్ర కాష్ఠాన్, గుడా
దికం వస్త్రసుమందిరాణి॥ 11-12-13-14

తం దృష్ట్వా నృప ఆహ శౌరి మనఘం భీత్యాకుల స్సంభ్ర
మాత్, కృష్ణో కింకరవాణి చేత్యగవచ శ్రుత్వా హసన్
సత్వరం, దూర్వాయుగ్మ మథానయన్ గణపతిం భుంక్ష్వేతి
హస్తే దదౌ, భుక్త్వా తృప్తి ముపాగత స్స పితరం ద్రష్టుం
జగామార్భకః॥ 15

తతశ్చ విష్ణుః ప్రహసన్ గిరీంద్ర, మాహ త్వ మజ్ఞానవశా
న్మహేశం, అనాదృత స్తస్య మహాత్మ్య మేత. దితః పరం
జాగృహి పర్వతేంద్ర॥ 16

వినబడుచునే యున్నది. ఒకరయినను ఆ మార్గమున వచ్చుటలేదు. కాని తుదకొక వృద్ధుడు కుంటి ముసలివృషభముపై ఈ బాలునితో కూర్చొనిరా చూచితివి. విచారింప నాతడే మీ కల్లుడు కానున్న వ్యక్తి యట. ఈ కుర్రవా డాయన మొదటిభార్యకు పుత్రుడట. ఆకలిచే బాధపడు వీతనిని - కాబోవు మీ యల్లుని యాజ్ఞచే తీసి కొనివచ్చితిని. వీనికి వెంటనే భోజనము పెట్టింపుడన - విరిగిన మానసముతో హిమవంతుడా కుర్రవానిని పాచకుల కర్పింపజేసి ఆలోచించుచుండెను.

11-14 ఆ వంటశాలయందు గల ఆరువేలమంది వంటచేయువారును ఆ కుర్రవానికి తృప్తిగా వడ్డించుటకు చేతగాని వారయిరి. తుదకా పసివాడు లేచివెళ్ళి అచ్చట పదార్థములు, నిల్వయున్న ధాన్యాదులును శాలతో సహా భక్షించి తృప్తిజెందక వంటవారితో, తదితరులతో - అయ్యా! అన్నమున్న చూపెట్టుడు. అది లేనిచో తండులములు, పప్పు, నెయ్యి, శాకములు, దధి, క్షీర,పాకములైనను నా కొసగుడు. వంటకట్టియలు పాత్రలు, గుడము, వస్త్రమాల్యాదులయినను నాకు భోజ్యములేయని కల్యాణశాలల కెగబ్రాకి భక్షింపసాగెను.

15 హిమవంతుడు స్వయముగా నా కృత్యమునుజూచి భీతిచే నాకులతచే భ్రమించి శ్రీ మహావిష్ణుని ప్రార్థింప యాత డచ్చటికి రా నాతనితో ఓ మహావిష్ణో! ఇంక నే చేయున దేమి యని మొరలిడ శ్రీహరి నవ్వుచూ నీ వటుండమని హిమవంతునితో చెప్పి రెండు గరికపోచలు తెప్పించి - ఓ గణపతీ! నీవు ప్రస్తుతము వీటిని భుజింపుమని ఆ కుర్రవాని కందజేసిన నాతడవి యారగించి తృప్తుడై - నేను మా తండ్రిని విడచి యుండలేను, వెళ్లెదనని వెళ్ళిపోయెను.

16 అంత విష్ణుమూర్తి నవ్వుచు ఓ రత్నగిరిరాజా! నీవు అజ్ఞానముచే శివుని అనాదరణము గావించితివి. దాని ఫలమే యిదంతయును - చూచితివి గదా. ఇకమీదట నయినను జాగ్రత నవధరింపుము.

* కర్తవ్యంకిమనంతరం తవగృహే నాస్త్యత్ర తాఃపూజితుం,
ఆయాత్యద్య వరః ప్రపూజనకరా ణ్యన్యాని నాస్త్యేవహి,
ఏతత్సర్వ మహీశ్వరస్యతు తృణం బాలస్య నాలం త్వయా
చానీతంహి పదార్థవస్తు నిచయం పశ్యాద్య తస్యోచితం॥ 17

ఇత్యుక్త్వా సర్వకల్యాణవస్తూన్ సంగృహ్య పద్మజం,
త్వం పత్నీసహిత స్తూర్ణ మాగచ్ఛేతి స్మృతో హరిః॥ 18

తతః పశ్యత్సు తద్రాజబంధుబృందేషు పద్మజః,
ఆగత స్సర్వ మాహృత్య చాకాశా ద్విద్యుత్ప్రభః॥ 19

గంధర్వా నథ కిన్నరా న్సపణవా న్యక్షాంశ్చ విద్యాధరాన్,
సిద్ధాన్ కింపురుషాంశ్చ దివ్యవసనాన్ దేవాన్ఋషీన్ రాక్ష
సాన్, కల్పద్రూ నథ కామధేను సహితం చింతామణిం
చాప్సరాన్, బ్రహ్మర్షీంశ్చ సరస్వతీం పరివహాన్ సంప్రాప్త
వాన్ పద్మజః॥ 20

---

* వ్యా॥- ఇత్యేవంతృతీయసర్గే 1శ్లో॥ ఆరభ్య 17శ్లోకపర్యంత
కథోక్త్యా ఈశ్వరస్య మహిమా త్వనంతం. దేవతాత్మ
హిమాద్రిరాజో౽పి ఐశ్వర్య గర్వాత్ త న్మాయయా
భ్రమితః. కిముత ! తదితరేషా మిత్యర్థః. తస్మా
చ్ఛివద్వేష మన్యద్వేషంచ అజ్ఞానాచ్చ సన్నిపాతి
రోగాచ్చ భవేత్. తస్మాత్ జాగ్రథ జాగ్రతేతి భావః॥

* 17 ప్రస్తుతము నీ సౌధమందు వరపూజ కక్షతలయినను లేవు గదా. ఇంక చేసెడి దేమున్నది ? అదిగో ! వాద్యధ్వనులు సమీపించుచున్నవి, శివుడు వచ్చుచున్నాడు. వరపూజా ద్రవ్యములు లేవు. గాన నీదగు ఐశ్వర్య మంతయును శివున కొక తృణప్రాయము. ఒక బాలుని చద్దికి చాలదేమ. కావున నివి శివేతరములగుటచే శివుని కల్యాణమునకు పనికిరావు. పనికి వచ్చెడి వేవందువా చూతుము.

18 అని చెప్పి శ్రీహరి శివకల్యాణార్థమగు సమస్తవస్తువుల గైకొని పత్నీసహితుడవై క్షణకాలములో నీ నిచ్చటికి రమ్మని బ్రహ్మదేవుని మనసా స్మరించెను. ఆ క్షణమందే–

19 అంత నచ్చట గల రాజబంధువులంద రాశ్చర్యముగ జూచుచుండ సర్వమును వెంట నిడుకొని ఆకాశమునుండి బ్రహ్మదెవుడు మెరుపువలె ప్రకాశించుచు నచ్చటి కవతరించెను. ఆ విశేషము లేమందురా ? వినుడు.

20 గంధర్వులు, కిన్నరులు, వాద్యములతో యక్షులు, విద్యాధరులు సిద్ధులు, కింపురుషులు, దివ్యులగు సనక సనందనాదులు దేవర్షులగు నారదాదులు, బ్రహ్మర్షులు, కల్పవృక్షము, కామధేనువు, చింతామణి, అప్సరసలు – వీటితో తన భార్య యగు సరస్వతీదేవీ సమేతుడై బ్రహ్మదేవు డచ్చటికి చేరెను.

---

* వ్యాఖ్య :– ఈవిధమున 3వ సర్గ 1వ శ్లో. మొదలు 17వ శ్లోక పర్యంతము చెప్పబడిన కథచే తెలియదగిన దేమన – ఈశ్వరుని శక్తి అనంతము. అంతటి దేవాంశసంభూతుడగు హిమవంతుడు సహితము ఐశ్వర్యగర్వముచేత తన్మాయామోహితు డయ్యెను. అందువలన తదితర సామాన్యుని గూర్చి చెప్పతగిన దేమున్నది. కావున శివద్వేషము, అన్యద్వేషము అజ్ఞాన సన్నిపాతములచే సంభవించును. అందుచే [illegible] జాగ్రత్త [illegible].

క్షణా త్సర్వం సిద్ధం నగరమథ కైలాససదృశం, తతో భేరీ
శంఖాః పణవపటహాః కాహళరవః, జగా ఢక్కానాద
ప్రదనుమురజస్త్వానకముఖా, మృదంగాద్యై ర్వీణా మురళిరవ
యుక్తాప్సరనృతిః॥ 21

ఏతస్మిన్ సమయేతు వాద్యవిభవై రాహ్వానసంఘార్చితో
భక్తాన్యోగగణాంశ్చ జ్ఞానమహితాన్ తత్పార్ష దాన్సన్మునీన్
యక్షేశంచ నిధీంశ్చ సిద్ధనికరాన్ వేదా న్పురాణాగమాన్
సద్రూపాన్ సగణాన్ ప్రగృహ్య వరద స్సంప్రాప్తవాన్
శంకరః। 22

వృషంతు ధర్మం భువనైకసుందరం, వృషాధిరూఢ శ్శత
కోటిమన్మథః, తద్భూషజాలం వరరత్న హాటకం, చానర్ఘ
తేజోమయ వస్త్రపాదుకే॥ 23

దృష్ట్వా సభార్యో హిమవా న్స విష్ణు, స్సంపూజ్య భక్త్యా
స్వపురం నివేశ్య, వరంచ సంపూజ్య విధానతో ర్వాం ప్రావే
శితః కల్పిత పారిజాతైః॥ 24

21 అంత విష్ణుదేవుని సంకల్పముచే నొక క్షణములో నా ప్రదేశమంత యును కల్యాణవస్తుసమేతమై కైలాసముగ మారెను. భేరీపణవ శంఖ పటహ కాహళ మంగళవాద్యధ్వనులు చెలరేగెను. ఢక్కా మురజావ్యానక ధ్వను లంతటా వినిపించుచుండెను. మృదంగ వీణా వేణు తాళ మురజములతో అప్సరనాట్యము చెలగుచుండెను. సర్వము సిద్ధమయ్యెను.

22 అట్టి శుభసమయమందే సర్వమంగళవాద్య విభవాదులతో నాహ్వాన సంభావితుడై భక్తయోగిజ్ఞానుల సంఘము వలగొన - దివ్యభాగ వత దేవర్షిముని పార్షద ప్రమథగణముతో నవనిధులను వెంట బెట్టుకొని సఖుడయిన కుబేరుడు ముందు నడువ - సిద్ధులును, వేద పురాణేతిహాసాగమాదులును స్వరూపధారులై రా సర్వపరివార ముతో శంకరుడా పురము ప్రవేశింప బంధుస్త్రీజన పరివారుడై హిమవంతు డా శివున కెదురేగి దర్శనమాచరించి బ్రహ్మానంద నిమగ్నుడయ్యెను.

23 అచ్చట నాపరమేశ్వరు డారోహించినధర్మమను వృషభము ధవళమై కైలాస సుందరమై యొప్పెను. ఇక నా వృషభము నారోహించిన పర శివుడు శతకోటిమన్మథాకారుడుగను, ఆయన ధరించిన వస్త్రభూష ణములన్నియును నవరత్న హాటకమయములుగను, అనర్ఘ తేజోమ యము లాతని దివ్యపాదుకలుగా నుండుట చూచి సర్వులును బ్రహ్మా నంద భరితు లయిరి. అంత -

24 భార్యాసహితుడై హిమవంతుడు శ్రీమహావిష్ణుమూర్తిని ముందిడు కొని శివుని గాంచి భక్తిచే పూజించి స్వీయపురమను ఊరెరిగించి వరపూజ విధివిధానముగ గావించి కల్పవృక్ష కామధేను చింతామణి పారిజాతములచే కల్పితమై వారందరకును నివసించుటకు యోగ్య మగు మహాసౌధమున వారిని ప్రవేశింపజేసెను,

తత్రాగతా స్సర్వమహత్త్వభారా ద్భూగోళమ ప్యుత్తర నిమ్న మాసీత్, తత్రైవ పశ్యేతి వరం ప్రగృహ్య, శివా దగస్త్యః ప్రగతశ్చయామ్యాం॥ 25

మార్గే త్వనేకాన్ శివవిష్ణుక్షేత్రాన్, ప్రకల్ప్య వింధ్యం ప్రణతం ప్రపాల్య, స దక్షిణే సహ్యశిరఃప్రదేశే చకార వాసం భగవా నగస్త్యః॥ 26

యావజ్జగద్భార సమో హ్యగస్త్యః, తత్తుల్య ఏవాఽస్య కమండలుశ్చ, అతో త్తరం పూర్వవదేవ సుస్థం, కల్యాణ మత్రైవ స్థిత స్స దృష్టః॥ 27

శ్వ ఏవ కల్యాణ మితి ప్రబోధ్య గృహం ప్రవిశ్యాద్రి నృపః పరేద్యుః, కాలేతు కృత్వా నిజకాల్యకృత్యం, కల్యాణసాధం ప్రవిశ త్స్వకీయైః॥ 28

శివోఽపి యక్షేశ మహర్షిసంఘైః, కల్యాణసన్మంటప మావిరాసీత్, సుమంగలీభి ర్మునిదేవసిద్ధ, నార్యాదిభి శ్వేద విదైశ్చ వాద్యైః॥ 29

25-26 కాని అచ్చటికి ప్రపంచమున గల మహాత్ములందరును చేరుట వలన భూగోళము భారముచే నుత్తరమునకు కుంగెను. శివు డగస్త్యుని పిలచి నీకు నా కల్యాణవైభవ మచ్చటికే కనబడును. కావున నీవు దక్షిణదేశమున కేగుమన శివాజ్ఞచే నాత డా మార్గమున ననేక శివ విష్ణ్వాదిక్షేత్రములు ప్రతిష్ఠించుచు మార్గమధ్యమున వింధ్యపర్వతరాజు ప్రణతుడుకా నాతని నటులనే యుండుమని పాలించి దక్షిణ దిశాగ్రమున గల సహ్యాపర్వతశిఖరమందా భగవంతుడగు నగస్త్యుడు నివసించెను. అంత భూమి యథావిధ మయ్యెను.

27 ఈ సర్వజగమెంతభారమో ఆ యగస్త్యుడంగుష్ఠప్రమాణుడైనను అంతటి భారము గలవాడు. అతనివంటిదే తత్కమండలమును. కావుననే మరల ఉత్తరోన్నతము, దక్షిణనిమ్నముగ భూమి యయ్యెను. ఆత డచటనుండియే పార్వతీపరమేశ్వర కల్యాణమును కనుగొనుచుండెను.

28 అంత నా హిమవంతుడు పరశివునితో రేపే కల్యాణమని తెలియజేసి స్వీయగృహము జేరి మరునాడు ప్రభాతమునలేచి నిత్యకృత్యము లాచరించి గౌరీపూజాంకురారోపణ నాందీముఖములు సలిపి స్వీయ పరివారముతో లగ్నమునకు పూర్వమే కల్యాణ మంటపమున బ్రవేశించెను.

29 అంత పరమేశ్వరుడును స్వకీయ యక్షేశ మహర్షి సురాసుర ప్రమథ సంఘముతో వాద్య ఘోషముతో నా కల్యాణ మంటపమునం దావిర్భవించెను. ముని దేవ సిద్ధుల భార్యలగు సుమంగలీ నివహముతో మంగళ వాద్యములతో వేదవిదులతో నా మంటపము శోభించెను.

వివాహకృత్యం కమలోద్భవస్తు పరిచాలిత శ్శంకరపక్షతస్సః హిమాద్రిపక్షేతు బృహస్పతిశ్చ, వర్ధద్వయం విఘ్నమయం సమస్తం॥ 30

సతీయుతోఽద్రీశ మహీపతిస్తు, ప్రక్షాళ్య పాదౌ పరమేశ్వరస్య, మూర్ధ్నాధృతః పాదజలం సవస్త్రం, మధుం దదౌ చేల తిరస్కృతేహి॥ 31

తతః కన్యాం వేణుపాత్రే చాసీయాత్రి చతుర్ముఖః!
శివస్య గోత్రప్రవరా మువాచేదం సువిస్మయం॥ 32

(బ్రహ్మ) అనంతకోటి బ్రహ్మాండ పర్యంతం శివమస్తు వై,
గోత్రే సదాశివాఖ్యేతు నప్త్రే పరశివస్యచ॥

పరమేశస్య పౌత్రాయ మహేశ్వరసుతాయతు,
శంకరాయ స్వభక్తానాం వరాయేత్యు క్తవాన్ త్రిధా॥ 33-34

గీష్పతి స్స ఉవాచేదం బ్రహ్మాండం శివమస్తువై,
ప్రథితే కాశ్యపే గోత్రే కన్యాం నప్త్రీ మజస్యతు,

కశ్యపస్యతు పౌత్రీంతు హిమవన్నగపుత్రికాం,
భవానీంచ సతీం గౌరీం పార్వతీం దాస్యతే త్రిధా॥ 36

30 అట్టి వివాహ కృత్యమందు శివుని పక్షమున సాక్షాద్బ్రహ్మదేవుడే పురోహితుడై నిలిచెను. హిమాద్రిరాజు పక్షమున బృహస్పతి బ్రహ్మత్వము వహించెను. ఈ రెండు పక్షములకును కార్య నిర్వాహకుడును పెండ్లిపెద్ద విష్ణుమూర్తియే యౌటచే ఆ పర్వమును విష్ణుమయ మయ్యెను. అంత

31 హిమవన్మహారాజేంద్రుడు పత్నీ సహితుడై సాక్షాచ్ఛంకరుని పాద ప్రక్షాళనమాచరించి ఆ శుద్ధజలమును పత్నితో శిరమున జల్లుకొని సువర్ణ వస్త్రమును తెరగా నేర్పరచి-వస్త్రభూషాదులచే మధుపర్కా-దుల నొసగి ధన్యుడ ననుకొనెను.

32 అటుపిమ్మట పార్వతీదేవిని వేణు పాత్రమందు కూర్చుండజేసితెర కిర్వలి భాగమున తలిదండ్రుల మధ్యన ఉంచి పిమ్మట బ్రహ్మ దేవుడు శివుని అద్భుతమగు గోత్ర నామము లీ విధముగ తెలియ పరచెను -

33 శ్రీ మదనంత కోటి బ్రహ్మాండములకును శుభము కలుగుగాక - సదాశివ గోత్రోద్భవుడగు పరశివునకు ముని మనుమడును, పరమే శ్వరునకు పౌత్రుడును, మహేశ్వర సుతుడు నగు, స్వకీయభక్తు లకు శంకరుడను కల్పిత నామధేయము గల పరమాత్మ యగు వరునకు - అని ముమ్మారు వుచ్చరించెను.

34-36 ఆ వెంటనే హిమవంతుని పక్షమున బృహస్పతి యిట్లు గోత్ర నామముల తెలియబరచెను. మనము నివసించు బ్రహ్మాండమునకు శుభము కలుగును గాక. సుప్రసిద్ధమగు కాశ్యప గోత్రోద్భవుడగు బ్రహ్మదేవునకు మునిమనుమరాలును, కశ్యపబ్రహ్మర్షికి మనుమ రాలును, హిమవంతుడను పర్వతరాజునకు ప్రస్తుతము పుత్రికా భావమున గల ప్రకృతి, భవాని, గౌరీ, సతి యను నామములు గల సాక్షాత్పార్వతీదేవిని భార్యగా హిమవంతుడు సమర్పించు చున్నాడని ముమ్మారు గొప్ప కంఠముతో వివరించెను.

కన్యాదాన మనంతరంతు కృతవా న్మాహేశ్వరస్యాద్రిరాట్ స్వీయస్థా న్బహురత్నఖాండ నిచయాన్ ధేన్వాదికం దత్తవాన్, మాహయా త్రేతు సజీరగం గుడ మథాత్మీస్తం తయోశ్శీర్షయోః, అన్యోన్యం పరిపశ్యతుః పరశివౌ శ్రీ పార్వతీ శంకరా॥ 37

మాంగళ్యంహి బబంధ శంకరగురు శ్శ్రీలోకమాతా గళే శ్రీదం దివ్య మశేషపుంస్త్వ వనితా దాంపత్య సంధాయకం, బ్రహ్మేంద్ర మహేంద్రమాని శివదం త్రైలోక్యసంపత్ప్రదం, మాంగల్యప్రద మర్థపుత్ర ఫలదం విశ్వప్రమోదం శుభం॥ 38

నానావాద్యనినాద మంగళరవే చార్ద్రాక్షతారోపణే, చానందాదిక మాదిరే హరిసతీ వాణీశచీ స్త్రీగణం,
గీతం చాప్సరసంఘ సంయుతసురా విద్యాధరా స్సంజగు స్సుశ్రావ్యం యజు ఋక్త్రి సామనిగమం ప్రోచు ర్మహా మానవః॥ 39

పార్వత్యా విమలాంజలౌ ప్రనిహితా యా ఇంద్రనీలాయితాః, న్యస్తా శంకర హస్తయోశ్చ విలసద్యాః పుష్పరాగాయితాః, ప్రస్తాయా శ్శివకాయభూషమిళితా వజ్రాదిరత్నా

37 అటుపిమ్మట సదస్యులు తథాస్తన హిమవంతుడా పార్వతీదేవిని శివునకు సువర్ణపాత్రోదకాక్షత పుష్పపూర్వకముగ కన్యాదానము గావించెను. తనయం దుద్భవించిన అనేక రత్న సువర్ణ ఖాండములను, ధేనువులు మొదలుగాగల దక్షిణయును సమర్పించెను. అంత సుముహూర్తసమయమేర్పడ దంపతుల శిరస్సులందు గుడజీరగముల నుంచి– తెరను తీసివైచిరి. ఆ వెంటనే పార్వతీ పరమేశ్వరులు మంత్రపురస్సరముగ పరస్పరమును చూచుకొనిరి.

38 సకలలోక కల్యాణప్రియుడగు శంకరుడును, ఆ సర్వమంగళయు లోకమాతయగు శ్రీ పార్వతీదేవి కంఠమందు మాంగళ్యమును బంధించెను. ఆ మాంగల్య మెట్టిదన ఐశ్వర్యప్రదము, దివ్యము, సర్వలోక స్త్రీపురుషులకు దాంపత్యసంధాయకమూలము. బ్రహ్మోపేంద్ర మహేంద్రులకు పైతము మంగళకరము, త్రైలోక్యసంపత్ప్రదము, లోకమంగళప్రదము, ధనధాన్యసంతతికరము, విశ్వమోదకరము, లోకసౌభాగ్యదాయకము నగును.

39 ఆ వెంటనె సకలవాద్య వినాదపూర్వక మంగళగీతములు చెలరేగుచుండ – దంపతులార్ద్రాక్షతారోపణమును మంచి ముత్యములతో గావించు సమయమున సాక్షాచ్ఛ్రీమహాలక్ష్మీదేవియు, సరస్వతీదేవియు, ఇంద్రాణ్యరుంధతీ మొదలగు దేవతామునిస్త్రీలును, అప్సర సుర నర విద్యాధరాదులును ఆనంద మానందమని పాడిరి. మహర్షులు ఋక్సామగానములు శ్రవణానందముగ గావించిరి. ఆ మంచి ముత్యముల సొంపు వినుడు.

40 అట్టి ఆర్ద్రాక్షతారూపమున గల ముత్యములు పార్వతీదేవి అంజలియందు మొదట ఉంచబడి ఆమె శరీరకాంతితో మిళితమై ఇంద్రనీలమణులవలె ప్రకాశించెను. కాని వెంటనే అవి శంకరుని అంజలియం దుంచబడి పుష్యరాగములవలె శోభించెను. పిమ్మట పార్వతీదేవి శివుల శరీరములందుజారి వస్త్రభూషాదులపై శేషముచే వజ్రాది నవరత్న కాంతి చేతను ప్రకాశించు చుండెను. అట్టి పార్వతీ

యితాః, ముక్తాస్తా శ్శుభదా భవంతు జగతాం గౌరీశ
వైవాహికాః॥ 40

(షట్పదీభృంగ వృత్తమ్)

బ్రహ్మా గ్రంథి నిబద్ధవాన్ శివశివా వస్త్రైకతః పద్మజః
తత్రస్థా స్వోచితాన్ ప్రపూజనవిధౌ యత్నేశ నారాయణౌ,
కల్పద్రూ న్సహ కామధేనుసహితం సంస్థాప్య మధ్యే సభం,
యేషాం యేచ ప్రకామితం మణిగణా న్నవ్యాంబరాన్
హాటకాన్, భూషాభూ త్యధికార దివ్య సదనారామాది
లోకాంతరాన్, భక్ష్యం భోజ్య మశేష పానవిచయం తాన్
దాపయామాసతుః॥ 41

ప్రధానహోమేతు గిరీశకన్యా, మశ్మాన మారోహ్య ప్రదక్షి
ణాదీన్, ప్రధానహోమం విదధే తత స్తౌ గౌరీశవౌ సాప్త
పదం గతౌహి॥ 42

తతోగ్నిసాక్షికే పాణి గ్రహణాఖ్యే సుమంగళే,
సభాలోక్య హిమవా న్ప్రాహ శివం నిర్దిశ్య పార్వతీం॥ 43

ఇయం శివా మమ సుతా త్వదీయ సహధర్మిణీ,
ప్రతీచ్ఛ చైనాం లోకేశ పాణిం గృహ్ణీష్వ భద్రదం॥ 44

# గౌరీకల్యాణము



కలాభ్యాం చూడాలంకృత శశికలాభ్యాం నిజతపః
ఫలాభ్యాం భక్తేషు ప్రకటితఫలాభ్యాం భవతు మే
శివాభ్యా మస్తోకత్రిభువన శివాభ్యాం హృది పున
ర్భవాభ్యా మానందస్ఫుర దనుభవాభ్యాం నతిరియమ్ ॥

శంకర వైవాహిక మహోత్సవమందు ఆ విధములచే ప్రకాశించిన ముత్యములు సర్వ బ్రహ్మాండములకును శుభము లొసగునుగాక.

41 (షట్పదీభృంగ వృత్తము)
అంత నాబ్రహ్మదేవుడు పార్వతీ పరమేశ్వరుల వస్త్రాగ్రము లేక ముగ చేసి బ్రహ్మగ్రంథిని గావించెను. ఆ సభయందున్నవారిని వారివారి మనోభీష్టానుసారముగ పూజించుటకై ఇరు పార్శ్వము లకును కుబేరుడును నారాయణుడును నిలచి సభామధ్యమున కామ దములగు కల్పవృక్ష పారిజాత కామధేను చింతామణులను స్థాపించిన నవి యెవరి మానసమున నేవి కావలయునని కలవో ఆ విధమున మణిగణ దివ్యాంబరహాటకాది భూషణములను ఉద్యోగాధికారములను దివ్యసదనారామ లోకాంతర భక్ష్య భో జ్యాన్న పానాదులను తృప్తిగా నొసగి సంతోషపరచెను.

42 అంత ప్రధానహోమమున పార్వతీదేవిని అశ్మారోపణము గావించి దంపతులచే నగ్నిప్రక్షిణాదులును, మైనాకునిచే నందివ్వ బడిన లాజహోమానంతరమున - సప్తపదీప్రామాణ్య దంపతీ కృత్య మాచరింపజేయబడెను.

43 పిమ్మట నగ్నిసాక్షిగ పాణిగ్రహణ మంగళకృత్య సమయమున భార్యాహితుడై హిమవన్నగరాజు పార్వతిని చూపుచు పరమే శ్వరునితో నీ విధమున బలికెను. వినుడు.

44 ఈ ఇదమానిర్దేశ్యస్వరూపురాలగు నీ మంగళప్రద పార్వతి నాకు పుత్రిక. నీవు స్వంపదనిర్దేశ్య పరమాత్మవయినను నీకు సహ ధర్మచారిణియే యగును. ఏలయన నీవు లోకేశుడవు. కావున నింతవరకును నేను నాది యని భావించిన వస్తువును నీ కర్పించు చున్నాను. దీనిచే నీ కికపైని నీమె స్వీయమే గావున స్వీకరిం పుము. ఈమెను పాణిగ్రహణము మీరు గావించినచో సర్వ బ్రహ్మాండములకును మంగళ మీ క్షణమందే యేర్పడును.

తచ్ఛ్రుత్వా పార్వతీం వీక్ష్య పాణిం స్వీకృతవాన్ శివః,
తత్పాణిగ్రహణే సర్వే బ్రహ్మానందం ప్రపేదిరే॥ 45

తదాభవ త్పుష్పవృష్టి ర్దేవదుందుభి నిస్వనం,
తత్రస్థ సర్వసంతోష దివ్యశబ్దాదికం హ్యభూత్॥ 46

తత్పార్వతీ మహేశస్య కల్యాణం లోకశంకరం,
దృష్ట్వానుజ్ఞా మనుప్రాప్య గతా శ్శంకరబాంధవాః॥ 47

తతః ప్రస్థాపయే త్యద్రిరాజ మాహ సదాశివః,
తథేతి పార్వతీం త్యక్తు మనిచ్ఛన్నపి చాద్రిరాట్॥ 48

నానారత్న విభూషణాన్ రథగజానీకాన్ హయాన్ కంబళాన్
దాస్యాదీన్ హరణం ప్రయుజ్య తనయాం ప్రస్థాపిత శ్చాద్రి
రాట్, మార్గే మారసతీం ప్రపాల్య నిఖిలాన్ ప్రస్థాప్య
స్వీయాన్ శివః, కైలాసం నిజకేళిమందరవరం ప్రావేశయత్
పార్వతీం॥ 49

మారోఽపి కజ్జలారూపాత్ స్త్రీణాం నేత్రే ష్వసంగతః।
స్థిత్వా రతీం స్వరూపేణ రమయామాస వైవరాత్॥ 50

45 శివుడా వాక్యమును విని పార్వతీదేవిని జూచి — తన దక్షిణ హస్త
ముతో నామెపాణిని గ్రహించెను. ఆ సమయమున సర్వబ్రహ్మాం
డములను బ్రహ్మానందనిమగ్న మయ్యెను. హిమవంతుడు తాను
కృతార్థుడ ననుకొని భార్యతో మైమరచి యానందించెను.

36 ఆ సమయమున సచేతనములకును ఆనందమును తెలియచేయు
పుష్ప వృష్టియు నా నా వా ద్య ము లు ను మ్రోగించకనే
మ్రోగుట యను సర్వసంతోషకరమయిన దివ్యమంగళోద్ధ వినాద
మేర్పడెను.

47 అంత నా మహోత్సవము చూడవచ్చిన శంకర హిమవత్ పర్వత
రాజ బంధుజను లందరును శ్రీ పార్వతీపరమేశ్వరుల కల్యాణ
మహోత్సవములను తిలకించి వారి యనుజ్ఞచే వారివారి నివాస
ములకు జనిరి.

48 అంత నీ పుత్రికతో మమ్ము ప్రయాణము చేసి పంపుదని హిమ
వంతుని శంకరు డడుగ నాతడు పార్వతీదేవి యను ప్రకృతిని
వదలుట కిచ్చ లేకున్నను పరమేశ్వరార్పణముగ పంపదలచి—

49 ఆ హిమవన్నగాధిరాజు అనేకరత్న భూషణములును, రథ గజ
తురగ పదాతి గణమును, దాసీజనులను, కంబళాదులను హరణ
ముగా నొసగి పంప పరిజనములతో నా దంపతులు కైలాసమున
కేగుచు — మార్గమధ్యమున వచ్చి శరణు వేడిన రతీదేవి ననుగ్ర
హించి ప్రమథగణముతో శివుడు తన కేళీమందిరమగు కైలాస
మున కేగి స్వీయాంతఃపురమున పార్వతీదేవిని ప్రవేశింపజేసెను.

50 శివుని వరానుగ్రహమున మన్మధుడు రతీదేవికి మాత్రము
పూర్వము వలెనే స్వస్వరూపమున నుండి తా ననంగుడై తదితర
స్త్రీలు తమ కన్నులకు ధరించు కాటుకరూపమున నుండి లోకరమ
ణము గావించుచుండెను.

ఏకాంతేతు కథంచి దద్రితనయా ముత్పాద్య షణ్ముఖం
దేవేభ్యః ప్రదదౌ శివస్సతు ఖలం తత్తారకం సంగరే।

హత్వా లోకసుఖం దదౌ హరసుత స్కంద శ్రీమూర్త్యా
త్మకః, సేనానీ హ్యభవత్తత స్సతు పితు ర్బ్రహ్మోపదేష్టా
గురుః॥ 51

శ్రీసూతః ఉవాచ :-

శ్రీదం భక్తిద మార్తినాశనకరం సంతాన సంపత్ప్రదం
ఆరోగ్యం పశుధాన్య భూరిధనదం దాంపత్య ప్రేమైక్యదం
శ్రోత్రానందకరంహి ముక్తిశకటం పౌరాణికం చిన్మయం
పార్వత్యాఃపరమేశవైభవమిదం శృణ్వంతు మానీశ్వరాః॥52

ఇత్యుక్తో పూజిత స్సూత శ్శౌనకాదీ నథాబ్రవీత్
తత్ర రామకథాం పూర్ణం పార్వత్యై ప్రాహ శంకరః॥ 53

కృష్ణోత్తరతటే దుర్గాక్షేత్రే విజయవాటికే
కృష్ణలంకే చిత్రకూటే సాకూ ద్రామస్య సన్నిధౌ॥ 54

ములుకుట్లోపనామ్నా శ్రీ నారసింహావధానినా
ఖండకావ్య స్వరూపేణ కల్యాణం పార్వతీశయోః॥ 55

51 అటుపిమ్మట నేకాంతమున వేదోవిధమున పార్వతీదేవి యందు శివుడు షణ్ముఖుని తనయునిగ నుత్పాదించి దేవతలు ప్రార్థింప వారికి సేనాధిపతిగ నొసగెను. ఆ కుమారస్వామియును వారితో నేగి తారకాసురుని వధించి సర్వలోకములకు సుఖమును కలుగజేసి త్రిమూర్త్యాత్ముడగు నా స్కందుడు దేవసేనాపతియై - తుదకు తండ్రికిని బ్రహ్మోపదేశము చేయుటచే గురుమూర్తి యని ప్రసిద్ధి వడసెను.

52 సూతుడు చెప్పుచున్నాడు :-

ఈ పార్వతీ పరమేశ్వర కల్యాణవైభవ చరితము పఠించువారికిని వినువారికిని శ్రోత్రానందదము, భక్తిదము, ఆర్తినాశకరము, సంతాన సంపత్ప్రదము, భూరిధనదము. ఏ కారణమువలన నయిన నను ఎడబాసిన దంపతుల నేకముజేయు మంత్రము- ముక్తికి చేర్చెడి శకటము. చిన్మయము, పౌరాణికము, కావున నో శౌనకాది మహర్షులారా ! దీనిని మీరు లోకమునకు వినిపింపుడు.

53 అని యా మహర్షులకు చెప్పి వారిచే పూజితుడై మరల వారితో నిటుల సూతుడు పలికెను. అటుపిమ్మట కైలాసమందా పార్వతీ దేవి శ్రీరామకథను సంపూర్ణముగ విన వేడ పరమేశ్వరుడా శ్రీరాముని ఉత్తరకాండకథాభాగమును ఈ విధముగ తెలియజేయు చున్నాడు.

54-56 ఈ విధమున సప్తగంగలలో నొకటయిన శ్రీ కృష్ణవేణీ నద్యుత్తరతీరమున సాక్షాత్ శ్రీ కనకదుర్గాక్షేత్రమగు విజయవాటికా పట్టణాంతర్గత కృష్ణలంక యందు గల చిత్రకూటాశ్రమమున సాక్షాచ్ఛ్రీరామచంద్రుని సన్నిధిని నివసించు ములుకుట్ల వరసింహావధాని పాకయాజి ఖండకావ్యస్వరూపమున శ్రీ పార్వతీ పరమేశ్వర కల్యాణవైభవమును శ్రీరామానుగ్రహముచే నేర్పడిన కవిత్వమున గ్రహించి రచించెను. కరుణామృతసాగరు డగు

(శ్రీ

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 8 | 4 | న్వైన తు | న్వైనంతు |
| 9 | 13 | చెలిక త్తెలరు | చెలిక త్తెలను |
| 10 | 7 | స్త్వైతి స్తత్రి | స్త్వైతిశో౽పి |
| ,, | 8 | తుష్టా | తుష్టా |
| 16 | 2 | వాసం | వాసః |
| ,, | 13 | నార్హః | నార్హం |
| 18 | 11 | మామకా: | మామకాః (ము |
| 25 | 7 | వండురు. | వందురు. |
| 27 | 5 | ప్రిళయకర | ప్రిళయకర్త |
| 33 | 11 | మ పార్వతివి | మా పార్వతివి |
| 36 | 11 | ద్వౌ తత్రియ | ద్వా తత్రియా |
| ,, | 11 | ద్యతోష్ణ | యతోష్ణ |
| ,, | 12 | వియుజ్యయేత్ | వియుజ్యతే |